# మధురకల్యాణం

[దృశ్యనాటిక]

రచయిత:

ధనికొండ హనుమంతరావు

పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

# మధుర కల్యాణం

[మేడమీది భాగంలో మధుకుమార్ స్టూడియోలోని పెద్ద హాలు. హాలు చివరిభాగంలో ఒక పిట్టగోడ: కాస్త దూరాన కొబ్బరిచెట్ల తలలు, ఇంకా అవతల మేడల పైభాగాలూ కనిపిస్తూంటవి.

హాలునిండా పత్రికలూ, కాగితాలూ చిందరవందరగా పడేసిఉన్నవి. ఇక కాల్చిపారేసిన సిగరెట్ పీకలకు లెక్కేలేదు. కింద పరిచిన తివాసీ దుమ్ముతో నిండిఉండటంవల్ల ఎవరైనా నడుస్తే దుమ్ము లేస్తూఉంటుంది.

గోడలరంగు తెలుపు మినహాగానేవుంది. గోడలను దుమ్మూ బూజూ అలంకరించినవి. హాలు మధ్యలో రెండు ఎలెక్ట్రిక్ బల్బులు వేళ్ళాడుతూన్నవి. వీటిమీద పిచ్చుకలు గూళ్ళు కట్టుకొని నివసిస్తూఉన్నవి. తమ స్వాతంత్ర్యాన్ని తెలియపరిచేందుకు అప్పుడప్పుడు అవి అరుచుకుంటూ అటూ ఇటూ తిరుగుతూంటవి.

హాలు చివరిభాగంలో రెండు స్టాండులమీద అసంపూర్ణ చిత్రాలు వేళ్ళాడుతున్నవి. ఈ చిత్రాలు మొదలిడి చాలాకాలమై వుంటుందనే సంగతి వాటిమీది దుమ్మే కాకుండా, కాగితపు చివర్లుకూడా చివికి వుండటంతో స్పష్టమవకపోదు.

రెండు పాత సోఫాలూ, మూడు కుర్చీలూ హాలులో చెల్లాచెదరుగా పడేసి ఉన్నవి. చూడగానే ఇది స్టూడియో అని తెలిసినప్పటికీ, యిక్కడ జనసంచారం చాలా తక్కువనే భావం మనకు కలిగితీరుతుంది.

హాలుమధ్యలో ఫ్లవర్ వాజ్ వుంది. అందులోని పూలు యెండిపోయి వున్నవి. దూరాన వున్న పిట్టగోడమీది క్రోటన్స్‌లోని మొక్కలుకూడా పొయిలోకి మాత్రమే పనికివొచ్చే స్థితిలో వున్నవి.

హాలు కుడివైపున అవతలికి పొయ్యే గది వాకిలి వుంది. ఈ వాకిలికి తెర అడ్డంకట్టినందువల్ల చిత్రకారుని ప్రత్యేక గది అనుకోవాల్సివుంటుంది.

ఎడమవైపు ముందుభాగంలో కిందినుంచి వొచ్చే చెక్కమెట్లు వున్నందువల్ల, ఎవరైనా వొస్తూంటే చప్పుడవక తప్పదు.

హాలులోని పెద్ద సోఫాలో మధు ముడుచుకొని పడుకొనివుండటం వల్ల, ఒకమనిషి ఉండనేవున్నాడనే సంగతి మనకు తెలియదు. అప్పుడే ఉదయించిన సూర్యుని కిరణాలు పిట్టగోడమీదినుంచి హాలులోకి జారబడి తగినంత వెలుగును ఇస్తున్నప్పటికీ, హాలులోని విద్యుద్దీపం ఒకటి వెలుగుతూనే వుంది.

క్షణం నిశ్శబ్దం. మెట్లమీద టకటకమనే శబ్దం......మరుక్షణంలో రామ్మూర్తి గాలివానల్లే వొచ్చిపడ్డాడు. ఆయన వయస్సు నలభైకిపైన ఎంతైనా వుండొచ్చు. నల్లని శరీరచ్ఛాయ; తెల్లని మీసాలు, ముఖంలో సీరియెస్‌నెస్ ఉట్టిపడుతూ వుండటంవల్ల ఏదో తీవ్రతను తనతో వెంట పెట్టుకొచ్చినట్లు తెలుస్తూనేవుంటుంది.

విసురుగా వొచ్చినవాడు అట్టే నిలబడిపొయ్యాడు. కాలు తాకిడికి తివాసీమీదినుంచి దుమ్ము ఒక చిన్న మేఘంలాగు లేచింది...అట్టే నివ్వెరపోయి ఏదో కొత్త విషయాన్ని కనుగొన్నవాడల్లే నాలుగుమూలలా కలయ జూచాడు. చూస్తున్నకొద్దీ ఆయన ముఖంలోని సీరియస్‌నెస్‌తోపాటు తీవ్రతకూడా ఘనీభవించసాగింది. తానలా శిలావిగ్రహంలాగు చూస్తూ వూరుకోవటం హాస్యాస్పదమనే సంగతి చప్పున గుర్తించాడు.

కాని అక్కడ ఎవ్వరూ లేకపోటం ఆయనకు మరింత కష్టమనిపించటంవల్ల తివాసీమీద చేతికర్రతో కాస్త గట్టిగానే చప్పుడుచేశాడు. ఈ శబ్దానికి ఇంటిలోనివా రెవరన్నా వొస్తారని ఆయన ఆశించాడు; కాని తివాసీలోనుంచి దుమ్ముమాత్రం లేచి ఆయన్ను సత్కరించింది...దాంతో దగ్గుతెరకూడా వొచ్చింది. విసుక్కున్నాడు; చీదరించుకున్నాడు. ఇది పనికాదని నిర్ణయించుకొని—]

రామ్మూ:—(ప్రమాదావస్థలో అరుస్తూన్నట్టుగా) మధుకుమార్ గారూ!...మధుకుమార్ గారూ! మధు...

[మధు మెల్లిగా సోఫాలోనుంచి లేచేటప్పటికి రామ్మూర్తి తను వృధా ప్రయాస పడుతున్నట్లు గ్రహించి ఆగాడు. మధు పాతికేళ్ళ యువకుడు, స్ఫురద్రూపి. మనసును దాచలేని కళ్ళు. చిందరవందరగా వున్న క్రాపు ఆతని ఫాలభాగం మీద పడుతోంది. ఒదులుగా వున్న చారల పైజామా; మరో వొదులు చారలచొక్కా. తెల్లవారినా నైట్‌డ్రెస్‌ను విసర్జించనందువల్ల సోమరితనం స్పష్టం. మనిషి ఆరోగ్యకరంగా, పొడుగ్గా ఉన్నాడు...]

మధు:—(కళ్ళు నలుపుకొని) ఎవరూ?...ఓ రామ్మూర్తిగారా?...కూర్చోండి...కూర్చోండి...

రామ్మూ:—అరె: ఇక్కడే వున్నారా?

మధు:—ఔను. చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నాను—

రామ్మూ:—(ఈ మర్యాదల్ని పెంచడం అనవసరమని)-సరే—నేను ఎందుకొచ్చానో తమకు తెలుసనుకుంటాను.

మధు:—కూర్చోండి...ముందు...

[భుజంమీది తుండుగుడ్డతో కుర్చీమీది దుమ్ము దులిపాడు. ఆ పాడు కుర్చీలో కూర్చోవటం బట్టలు పాడుచేసుకోవటమే అవుతుందనే ఆలోచనతోనూ, తను వొచ్చిన పనిలోని గాంభీర్యం తగ్గుతుందనే అనుమానంతోనూ, రామ్మూర్తి అలాగే నిలబడ్డాడు.]

రామ్మూ:—ఏమిటయ్యా—కొంపంతా యిలా తయారు చేశావ్? మొదట్లో ఇది నా ఇల్లేనా అనే అనుమానం కూడా కలిగింది.

మధు:—(నీళ్ళు నములుతూ) కూ్రాడు సెలవు పెట్టాడు...అందుకని శుభ్రంగా లేదు. అంతే!

రామయ్య:—మీ వ్యవహారం నాకేం బాగాలేదు... సరే... అద్దె ఇప్పిస్తారా ?

మధు:—మరొక్క పదిరోజులు ఆగండి—

రామయ్య:—ఆరునెలలూ ఇలాగే గడిపావ్. చాలా బాగుంది. ఏమిటీ వాయిదాలు ? ఇళ్ళు అద్దెలకు ఇచ్చుకుంది మీ చుట్టూ తిరగటానికేనా ?

మధు:—తమరు శ్రమపడి ఈ మెట్లన్నీ ఎక్కిరానక్కర్లేదు. పైకం చేతులోకిరాగానే నేనే మీదగ్గిరికి వొచ్చి ఇస్తాను.

రామయ్య:—అంటే తమ చేతులోకి పైకం వొచ్చే దాకా వేచివుండాలన్నమాట: అంతవరకూ తమ దర్శనం చేసుకోవటం వృథా అన్నమాట !

మధు:—డబ్బులేనిదే మీ బాకీ ఎలా తీర్చగలను ?

రామయ్య:—మరి పదిరోజుల్లో ఇస్తానన్నారు ?

మధు:—చూడండి—ఆ మూలను ఉన్నయ్యే—రావు బహద్దూర్ గారి బొమ్మ; ఆ పక్కది వారి సతీమణిది. ఆ రెండూ పూర్తికాగానే డబ్బు వొస్తుంది.

రామయ్య:—నాలుగు నెలలక్రితంకూడా ఆ బొమ్మలే చూపావు. ఈనాటివరకూ అవి పూర్తిగాలేదు. అవి పూర్తయితే ఏదో వొస్తుందని చెపుతావు...అవి పూర్తవకపోవటం మా దురదృష్టం...చూడండి మధుకుమార్ గారూ ! వొచ్చే నెలలో మ్యునిసిపల్ టాక్సు కట్టాలి. అద్దె ఇవ్వకుంటే మర్యాద దక్కదు.

మధు:—నెలరోజులు వ్యవధి వుందికదా!

రామ్మూ:—మీరేదో పేరున్న చిత్రకారులసీ, కళోపాసకులనీ వస్తాయిస్తున్నాను. ఇంకోరైతే యీపాటికి బైటకి లాగేసేవాణ్ణి...

మధు:—(మృదువుగా) నేనొక సలహా ఇస్తాను...మీ బాకీకింద తమ బొమ్మ గియ్యమంటారా?

రామ్మూ:—నాకు బొమ్మలూ వొద్దు—వంవొద్దు. కాస్త వొళ్లొంచి నాలుగుబొమ్మలు రాసుకొని, నాలుగుడబ్బులు చేసుకోవయ్యా—రేపు సంసారివైతేకాని డబ్బువిలువ తెలియదు...

మధు:—స్వామీ! కిందా మీదా పడి తమబాకీ తీరుస్తానుగా...

రామ్మూ:—ఏదో నాకోసం చెపుతున్నా ననుకుంటున్నావు. అంతేలే—సరే యేమన్నా చేసుకో...నెలాఖరుదాకా వాయిదా ఇస్తున్నాను...మీ మర్యాద కాపాడుకొని, మా మర్యాదకూడా కాపాడాలి.

[మధు ఏదో మాట్లాడబోయ్యాడు. కాని రామ్మూర్తి వినిపించుకోకుండానే వెళ్ళిపొయ్యాడు. మధు నిట్టూర్చి సోఫాలో కూలబడ్డాడు. క్షణం నిశ్శబ్దం. ఇంతలో మళ్ళీ మెట్లమీద చప్పుడు. మధు లేచి చూశాడు. ఇదివరకు లేని ఉత్సాహం అతని ముఖంలో చిరునవ్వు రూపాన వెలిగింది.

దాసు వొచ్చాడు. ముప్పైఐదు సంవత్సరాల వయస్సు. పొట్టిగా కుదిమట్టమైన మనిషి. గుండ్రని ముఖానికి ఏవిధంగానూ సరిపడని కళ్ళజోడు. పైకి దువ్విన క్రాపు. నల్లని లాగూ. నల్లని కోటూను—]

మధు:—రా బ్రదర్! ఊరినుంచి ఎప్పుడొచ్చావ్? చాలా రోజులు మకాం వేసినట్లున్నావే? అసలు ఏమయ్యావో మీ ఇంటికి వొచ్చి కనుక్కుందామనుకుంటున్నాను—

దాసు:—(ఆశ్చర్యంగా హాలంతా చూసి) ఏమిటీ చెయ్యాలకొంప? ఇంత సుందర ముదనష్టంగా ఉందేం?

మధు:—అది అంతేలే—

దాసు:—రామ్మూర్తి వొచ్చినట్లున్నాడే? కింద ఎదురయ్యాడులే! బాగా కడిగాడా? అసలు నిన్నింకా యీ ఇంట్లోనుంచి బైటకి యీడవలేదేమా అని ఆశ్చర్యపోతున్నాను—

మధు:—ఎట్లా యీడుస్తాడు? ఆరునెల్ల అద్దె వొదులుకుంటేనేకాని ఆ పని చేయలేడు. బాకీ పోతుందేమోననే ఆయన భయంవల్ల మనం సురక్షితంగా ఉండగలం—

దాసు:—అసలు యీ చెత్తలోనుంచి కళ ఎలా బయలుదేరుతుందా అని...?

మధు:—అదే తమాషా! వికృతంగా వున్న గొంగళీ పురుగులోనుంచే అందమైన రంగురంగుల సీతాకోకచిలుక పుడుతుంది—

దాసు:—అది నిజమేకాని నీ విషయంలో మాత్రం గొంగళీపురుగు మారేట్లుగా లేదు. ఎక్కడ వున్నావే గొంగళీ అంటే—వేసినచోటనే అన్నట్లుగా వుంది...ఆ రావుబహద్దూర్ తాలూకు చిత్రాలు యీ శతాబ్దంలో పూర్తికావా యేం?

మధు:—చేస్తాను...తొందరేముంది లే?

దాసు:—తొందరా? చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావే? ఆయన ఆర్డరిచ్చి నాలుగు నెల్లైతే ఇంకా తొందరంటా వేమిటి? నిన్న సాయింత్రం ఊరినుంచి వొచ్చాడో లేదో, తెల్లారకముందే పిలిపించి సతాయించాడు. నీకు పని ఇప్పించినందుకు నా పరువు కూడా కాస్త నిలబెట్టు-

మధు:—చిత్రం పూర్తయాక చూస్తే ఆయన తప్పక మెచ్చుకుంటాడు.

దాసు:—నాకూ ఆ ధైర్యమే వుండేది కాని, అసలు ఇది ఎప్పటికి పూర్తవుతుందా అని—

మధు:—ఈ సాకుతోనన్నా నీవు అప్పుడప్పుడు వొస్తుంటావు...ఇది కాస్తా పూర్తయితే మరి మనకు పనికూడా ఉండదాయె! ఏదో కొంత పని చేయవలసిన బాధ్యత వుంది కదానని యీ అసంపూర్ణ చిత్రాలు చూస్తుంటే గుర్తొస్తూ వుంటుంది. ఇదికూడా లేకుంటే సోమరితనం మరీ బలిసి పోతుంది—

దాసు:—అట్లా దారికిరా! నీలోని కళాన్వేషణ అంతా ఏమైందా అని ఆశ్చర్యపోతున్నాను.

మధు:—ఏమైందీ? వుంది...అది అగ్ని పర్వతమల్లే ఏనాడైనా పగలవచ్చు.

దాసు:—సంవత్సరంనుంచీ ఇదేపాట పాడుతున్నావ్. కాని ఆ అగ్నిపర్వతం ఇప్పట్లో పగులుతుందనే ఆశ నాకు

లేదు. ఎంత పోరినా పనిచేయవాయె! నా అనుమానం ఏమంటే—ప్రేలోని అగ్నిపర్వతం శాశ్వతంగా చల్లారిందేమో నని.

మధు:—నాకైతే అలాంటి అనుమానం లేదుకాని, నాలోని కళకు తగిన ప్రోత్సాహం లేకుండాపోవటంవల్ల...

దాసు:—ఏం ప్రోత్సాహం కావాలి? రావుబహద్దూర్ చిత్రాలకు ఆర్డర్ ఇప్పించానా? సీపోరు పడలేక రెండు వంకలు ఎడ్వాన్సు కూడా యిప్పించానా? కాని ఇంతవరకూ వాటిని పూర్తిచేశావా—?

మధు:—చేస్తానుగా! ఒక్క— ఆర్థిక బాధలేకాదు... పనిచేయ బుద్ధిపుట్టటంలేదు. మనసు ఉత్సాహకరంగా వుండటంలేదు...

దాసు:—నిజమే! ఆర్థికపరిస్థితులు బాగుపడ్డంతమాత్రాన కళ ఉద్ధరించబడుతుందనే నమ్మకం నాకులేదు. కొంత బాధ్యతకూడా ఉండాలి... లేకపోతే ఎనిమిది గంటలైనా ఇంకా లైటు అలాగే వెలుగుతూంటుందా?

[మధు లేచివెళ్ళి లైటు ఆర్పివొచ్చాడు]

మధు:—అంటే—నీలాంటి మిత్రుడొకడు రోజూ గొంతు మీద కూర్చొని సతాయిస్తూ ఉండాలంటావా?

దాసు:—అదీ ఐందిగా!...మిత్రులు లాభంలేదోయ్—

మధు:—మరి?

దాసు:—పొట్లకాయకు కింద బరువైన రాయి కడతారు— ఎందుకో తెలుసా?

మధు:—వంకర పోకుండా బారుగా సాగేందుకు

దాసు:—అలాగే నిన్ను సక్రమమార్గంలో నడిపించే బరువు వొకటి అత్యావసరం. కనుక వెంటనే పెళ్ళిచేసేసుకో—

మధు:—బాగానే వుంది—నా జీవితమే నాకు భారమైతే...?

దాసు:—జీవితం భారమైకాదు నీవు బాధపడేది; జీవితాన్ని సక్రమంగా ఉపయోగించుకునే అవకాశం లేక! భార్య అనీ, బిడ్డలనీవుంటే వాళ్ళకోసమన్నా వొళ్లొంచి పని చెయ్యాలన్న బాధ్యత ఏర్పడుతుంది. నీ కష్టాలకు హృదయపూర్వకంగా సానుభూతి చూపే వ్యక్తి, నిన్ను అర్థం చేసుకొని ఒక దారిన నడిపించే జ్యోతి అత్యావసరం. నీకే గృహిణి వున్నట్టయితే యీ కొంపింత అధ్వాన్నంగా వుండేదా? నీవింత సోమరిగా తయారయ్యేవాడివా?...యీ విధంగా ఒంటరిగా రోజంతా గడపటం ఎంతకష్టం!

మధు:—అందుకని ఒక తెను మెడకు కట్టుకొని వూరేగమంటావ్?

దాసు:—వైవాహిక జీవితాన్ని గూర్చి నీకు కొన్ని దురభిప్రాయా లున్నట్లున్నయ్...ఇలా బాధ్యతా రహితంగా బతకటం మాటలు కాదు—!

[మధు ఆలోచనలో పడ్డాడు]

దాసు:—నామాట విను. నీలోని కళావాహిని పూర్తిగా ఇంకిపోకముందే త్వరపడు. నీ కళాలక్ష్మిని ఉద్రిక్తపరిచే

విధానాలను అన్వేషించు. నీచేత చిత్రలేఖనం చేయించగల వ్యక్తిని ఎన్నుకో...రోజురోజుకూ వయస్సు పెరుగుతోంది. జీవితం సమాప్తి గాకపూర్వమే జీవితాన్ని అనుభవించు. ఏవో రోజులు గడుపుతూ మృత్యువుకు దగ్గరగా జరగటం వల్ల ప్రయోజనం లేదు.

మధు:—నీవు చెప్పావే—నాలోని కళాభిరుచుల్ని ఉద్రిక్త పరిచే వ్యక్తిని—ఆమె ఎక్కడ దొరకుతుంది ? తీరా పెళ్ళాడితే చిత్రలేఖనం అంటే తెలనొప్పిగా వున్నామె ఐతే...?

దాసు:—భారతదేశంలో ఆడపిల్లలకు కొదవేమిటోయ్ ?

మధు:—ఎవతెనో ఒకతెను చేసుకోమంటావా ?

దాసు:—అలా అనను...నీవు కోరిన చిత్రలేఖనంలో అభిరుచి ఉన్నామెనే చేసుకోందువుకాని...కుర్రాడు ఏడీ. కాస్త కాఫీ తెప్పించుకుందాం.

మధు:— లేడు.

దాసు:—రాలేదా ?

మధు:—రెండునెలల జీతం ఇవ్వకుంటే ఎవడొస్తాడు ?

దాసు:—చూశావా ? నీకే సంసారమంటూ వుంటే యీ బాధలన్నీ ఆ ఇల్లాలు పడేది. నా సంగతి చూడు. ఎక్కువసేపు నేను బైట గడుపుతాను. ఇంటివిషయాలన్నీ మా ఆవిడే చూసుకుంటుంది. మరీ యీ అప్పులవాళ్ళను యీ ఆడవాళ్ళు మహా సులువుగా వొదిలించుకుంటారు !

మధు:—నీ సంసారం చూశాకనే కొంతవరకు భయపడ్డాననుకో—

దాసు:—అట్లా క్కాదోయ్... ఎంత అలసిపోయి, విసుగు చెంది యింటికి వెళ్ళినా, ఇంట్లోనన్నా మన కష్టాలకు సానుభూతి దొరుకుతుంది. ఒకసారి చూచిన తమకే తెలియగలదు.

మధు:—ఏదో శాంపిల్ అన్నట్లుగా చెప్తున్నావే. ఒకసారి పెళ్ళాడాక, మరి వొదిలించుకోవట మంటూ వుండదుగా!

దాసు:—అందుకనే వొక పని చేద్దాం...తొందరపడకుండా అన్నీ విచారించాకనే సంబంధాన్ని ఖాయపరుద్దాం... అందుకుముందు కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరిగే వోపిక మనకు లేదు కనుక, తేలిగ్గా వధువు దొరికే ఆలోచన చేశాను.

మధు:—ఏమిటది? పత్రికల్లో ప్రకటనా?

దాసు:—ఎగ్జాక్ట్లీ...మనకు నచ్చిన వధువు దొరక్కపోయినా పెద్ద నష్టంవుండదు...(కాగితంమీద రాసి, కొట్టేసి, రాసి...) చూడు; కావలెను; పాతిక సంవత్సరాల యువక చిత్రకారునికి అందమైన, చదువుకున్న యువతి వివాహానికి కావాలి. కట్నాలూ, కానుకలూ అక్కర్లేదు. వివరాలతో ఫొటోతోసహా యీ కింది చిరునామాకు రాయండి—

మధు:—'ఉచితం' అంటే యీ దేశంలో ఖర్చయినన్ని మరే దేశంలోనూ ఖర్చు కావు. కట్నాలూ అవీ అక్కర్లేదంటే దరఖాస్తులు వాగన్ల పరిమాణంలో దిగుతయ్యేమో?

దాసు:—కాని... నీకు సెలక్షన్‌కు మంచి అవకాశం వుంటుంది.

మధు:—చిరునామా ఏమిటి ఇస్తావ్?

దాసు:—బాక్సు నెంబరు వేయిస్తాను.

మధు:—ఇది ఫలిస్తుందని నాకు నమ్మకం లేదు.

దాసు:—ముందుగానే అక్షింతలెందుకోయ్ — పెళ్లికొడకా!

[మధు చిరునవ్వు నవ్వాడు]

దాసు:—చూశావా—పెళ్ళికొడకా అనగానే నీముఖంలో ఆనందతరంగం లేచింది. పెళ్ళయితే యిక ఆనందసాగరమే అనుకో—

మధు:—ఆ సాగరాన్ని యీదలేక మునుగుతానేమో?

దాసు:—తెప్ప కట్టుకు తేలిపోరా రంగా!

[తెర]

## II

[కాలేజిలో గరల్స్ వెయిటింగ్ రూమ్. నాలుగైదు కుర్చీలు చిందర వందరగా పడేసి ఉంటవి. ఒక బెంచీ, ఒక చిన్న టేబిలు; టేబిల్ మీద రకరకాల పత్రికలూ పడేసి ఉన్నవి. కుర్చీలలో నిర్మల, సత్యవతి కూర్చొని పుస్తకాలు చూస్తున్నారు. పద్మావతి తన ముఖం కనిపించకుండా పత్రిక అడ్డం పెట్టుకొనివుంది.]

పద్మ:—(పత్రికను క్రిందికి దింపి, పెద్దగా వినండి... వినండి!

[కల్యాణి గదిలోకి వొచ్చింది. ఎండలోనుంచి రావటంవల్ల ముఖమంతా చెమటపట్టింది. కోలముఖం—తీర్చిదిద్దిన ముక్కు; పెద్దకళ్ళు; సన్నగా, పొడుగ్గావుంటుంది. నడకలో వయ్యారం. ఒకరకం గర్వం. కోపిను. యవ్వన శోభ శరీరమంతటా స్పష్టమౌతూ నేవుంటుంది. జీవితమంటే ఆనందమేనని చాటే నవ్వు ఎర్రని పెదవులమీద తొణికిసలాడుతూ వుంటుంది. ఖద్దరు సిల్కు చీర; సిల్కు జాకెట్; చేతికి రిష్టువాచీ; మెడలో కెంపులు పొదివిన గొలుసు; చేతులకు రెండేసి జరీలగాజులు. చూడగానే పెద్దింటి పడుచని గ్రహించవొచ్చు. వొచ్చి విసురుగా పుస్తకాలను టేబిల్ మీద పడేసి, నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడి, జేబురుమాలుతో ముఖం తుడుచుకుంది.]

పద్మ:—(అందరి దృష్టిని ఆకర్షించేందుకు అరుస్తూ) అందరూ వినండి!

కల్యా:—(పద్మవైపు చూస్తూ) ఏమిటది?

[నిర్మలా, సత్యవతీ, పద్మావతి చెప్పేది వినేందుకు సిద్ధంగా వున్నట్టు ఆమెవైపే చూస్తూన్నారు]

పద్మ:—కావలెను: పాతిక సంవత్సరాల యువక చిత్రకారునికి అందమైన చదువుకున్న యువతి వివాహానికి కావాలి. కట్నాలూ కానుకలూ అక్కర్లేదు. వివరాలతో ఫోటోతో యీ కింది చిరునామాకు రాయండి: బాక్సు నెం 402. కేరాఫ్ వీరాంధ్ర, మెడ్రాస్.

నిర్మల:—స్వయంవరమన్నమాట?

సత్య:—ఆ ప్రకటనను ముందుగా నీవే చూశావుకనుక, నీవే దరఖాస్తు పెట్టు.

పద్మ:—దరఖాస్తుకేం—అందమైన యువతి కావాలట! అందులోనూ అతను చిత్రకారుడు. ఏకాస్త లోపమున్నా లాభంలేదు...

నిర్మ:—ఐతే—సత్యవతీ! నీవొక దరఖాస్తు పారెయ్. నీ తల్లిదండ్రులకు ఎంతో కొంత సమకూర్చినదాని వౌతావ్!

సత్య:—నేనుమాత్రం అందమైన దాన్ననా? నాకు ఏమీ ఆశలు లేవు.

నిర్మ:—అందమైన యువతి కావాలని ప్రకటన వేయటం మామూలు. కురూపి కావాలని ఎవరూ కోరుకోరుగా! వొచ్చిన దరఖాస్తుల్లో నీవే అందగత్తెవు కావొచ్చు. ఎవరు చెప్పగలరు?

సత్య:—అలా ఐతే మనం నలుగురమూ దరఖాస్తులు వేయవలసిందే!

నిర్మ:—నలుగురూ అనవసరం. మనలో మనకే పోటీలు ఏర్పడుతయ్. ఒకవేళ అందరమూ వేసినా, కల్యాణి ఉన్నంతవరకూ మనదాకా రానీదు.

కల్యా:—(నవ్వుతూ) నేను మానుకుంటానుకాని, మీరే దరఖాస్తులు వేసుకోండి.

నిర్మ:—అదెలా? చిత్రకారులంటే నీకు తగని అభిమానం. నీ అభిమాన చిత్రకారుడు మధే యీ ప్రకటనను వేసి ఉండొచ్చు. చూడబోతే యీ ప్రకటన నిన్ను ఉద్దేశించి వేసిందేమోనని నా అనుమానం.

సత్య:—అందమైన యువతి కావాలనే యీచిత్రకారుడు అందగాడో కాదో?

పద్మ:—అందమైన భార్య లేకుంటే అందమైన చిత్రాలు దిగవు. అందమైన బొమ్మలు కాకుంటే ఆ చిత్రాలను యెవరు మెచ్చుకుంటారు ?

సత్య:—ఔన్లే...అందుకనే నా వోటు కల్యాణికి యిస్తున్నాను.

పద్మ:—తలుచుకుంటే కల్యాణి ఒక ప్రత్యేక స్వయంవరాన్నే నడిపించగలదు—

సత్య:—కాలేజిలో నడిపిస్తూనేవుంటిగా ! మనం యింత మందిమి వుంటే—విద్యార్థుల దృష్టంతా కల్యాణిమీదనే వుండటం స్వయంవరం కాక మరేమిటి ?

నిర్మ:—వీళ్ళందరికీ బుద్ధొచ్చేలాగు కల్యాణి మేనబావ బ్రహ్మన్ని పెళ్ళాడుతుంది—

కల్యా:—ఛా...ఛా ! నేనెప్పుడన్నా అలా అని నీతో చెప్పానటే ?

నిర్మ:—పాపం: యెప్పుడూ నీ కొంగు పట్టుకొని వెళ్ళాడే బ్రహ్మనికి డిసప్పాయింట్ మెంట్ ! పోనీ పాపం ఆసంగతి అతనికి చెప్పలేకపోయ్యావ్ ?

కల్యా:—ఎంత జాలిగుండే నీది ! నేను చేసుకుంటాననీ చెప్పలేదుగా ! పోనీ అంత సానుభూతి వుంటే ఆ బ్రహ్మన్ని నీవే పెళ్ళాడరాదూ ?

నిర్మ: —ఏదీ నావెంట పడ్డాడా యేమన్నానా ? నీకు పనికిరానివాళ్ళందర్నీ మామీదికి ప్రయోగిస్తూవుండు...సరే

కయన సంగతి తరువాత చూద్దాంకాని, ముందు యీ నాయకుడికి దరఖాస్తు పెట్టుకో.

పద్మ:—యీ వివాహం స్థిరమైతే కొంతమంది ప్రేమికులు ఆత్మహత్యలు చేసుకోవటమో, దేశదిమ్మర్లు కావటమో జరుగుతుంది.

కల్యా:—అందుకని లోకకల్యాణార్థం నేను పెళ్ళిమాట తలపెట్టకపోవటం మంచిది.

నిర్మ:—ఎట్లా? నీవు కన్యగా వుంటే రోజురోజుకూ ప్రేమబికారీగాళ్ళ సంఖ్య పెరుగుతూనే వుంటుంది. చివరకు నీ పేరుమీద పిచ్చాసుపత్రి కట్టించాల్సిన అవసరం కూడా యేర్పడుతుంది—

సత్య:—కనుక లోకకల్యాణార్థం నీ కల్యాణం త్వరగా కావటమే మంచిది. దాంతో నీ సమస్యా, నీ ప్రేమికుల సమస్యా పటాపంచలవుతవి—

పద్మ:—అప్పుడు మిగిలిన మా ముగ్గురికీ వరులు దొరికే అవకాశం వుండొచ్చు—

కల్యా:—నాకు లేని తొందర మీకెందుకే?

నిర్మ:—అప్పుడే పెళ్ళి ఐపోయినంత ఆనందాన్ని అనుభవిస్తున్నావల్లే వుంది!

కల్యా:—పెళ్ళిని గూర్చిన ఆలోచనే నాకింతవరకూ కలగలేదంటే నమ్ము.

నిర్మ:—ఇప్పుడు యీ ప్రకటన చూశాకన్నా కలగకుండా వుండేందుకు వీల్లేదు...నామాట విని దరఖాస్తు పెట్టు.

కల్యా:—నాకు అనవసరం.

పద్మ:—జాగ్రత్తగా ఆలోచించు. ఒకవేళ నీ అభిమాన చిత్రకారుడే నేమో? చిత్రకళ అంటే చెవి కోసుకునే నీకిది చాలా మంచి సంబంధంగా పరిణమించవొచ్చు.

సత్య:—కనీసం పురజనుల కోరికపైనన్నా—

కల్యా:—ఇతర్ల సుఖంకోసం పెళ్ళాడమనేట్లున్నారు—

పద్మ:—స్వార్థమే కాకుండా, ఇతరుల్నికూడా వొక కంట కనిపెట్టివుండాలి...ఐనా అప్పుడే కల్యాణమంటపం దాకా మనం పోవటం బాగాలేదు. కల్యాణీ! నీవెంతో అందగత్తెవు, నీ అందచందాల్ని పరీక్షించుకునేందుకు యీ అవకాశం గీటురాయి లాటిది!

సత్య:—అంటే వొకవేళ ఆ చిత్రకారునికి కల్యాణి నచ్చకపోతే...?

నిర్మ:—అదే చూడాలి! సౌందర్యాన్ని అన్ని కోణాల నుంచీ నిశితంగా చూపగల కళోపాసకులే ఆ సంగతిచెప్పాలి.

కల్యా:—ఎందుకే ఇవ్వాళ నామీద పట్టించారు?

సత్య:—ఏంలేదు. మన కాలేజినుంచి బొత్తిగా రిప్రజన్టేషన్ లేకుంటే ఆడజాతికే తలవొంపులు...

కల్యా:—ఐతే మీరెవరైనా దరఖాస్తు వేయండి.

నిర్మ:—మన తరఫున నీవే అందుకు తగినదానివని నిర్ణయించాం.

సత్య:—అంతే—కల్యాణి వేయాలి.

పద్మ:—పాపో అక్కా కల్యాణికే!

కల్యా:—(కోపంగా) నాకు అనవసరమంటూంటే!

పద్మ:—బహుజనాభిప్రాయాన్ని అంత తేలిక చెయ్య పోక...నిప్పు పరీక్షాస్త్ర చెయ్యక తప్పదు.

కల్యా:—నావల్లకాదు—నన్ను వేధించకండి.

సత్య:—పోతే ఓడిపోయ్యానని ఒప్పుకుంటావా?

కల్యా:—(కోపంతో) ఓడిపోయ్యేందుకైనా, గెలిచేందుకైనా, పాల్గొంటేకదా తేలేది?

పద్మ:—అందుకనే పాల్గొనమని మా ప్రార్థన.

సత్య:—నీకేమీ శ్రమఉండదు. అప్లికేషన్ మేమే రాస్తాం. సంతకం చేస్తే సరిపోతుంది. ఫోటో పెట్టి పంపేద్దాం.

నిర్మ:—యీ చిత్రకారుడు ఇక కల్యాణి బొమ్మతెర్నే దించుతాడు కాబోలు!

కల్యా:—మనకెందుకొచ్చిందే ఇదంతాను?

పద్మ:—ఏదో తమాషాకు—సరేనా? ఇందులో వొచ్చే నష్టం ఏముందీ?

సత్య—మనం ఒక సంగతి మరచిపోకూడదు. కల్యాణికి ఇది పరీక్ష అనే అనుకుందాం. ఐతే ఆమె భాగ్యవంతుల బిడ్డ అని తెలియపరచవొద్దు. ఎందుకంటే—కల్యాణి మొదటినుంచీ ప్రతి పురుషుణ్ణీ అనుమానిస్తూనేవుంది; తనతోపాటు బోలెడు ఆస్తిపాస్తుల్ని వెంటేసుకొస్తుందనే ఆశతోనే యీ మొగపురుగులు, తనవెంట పడుతున్నారని ఆమె

నమ్మకం. అందుకని ఒక బీదకన్యగానే కల్యాణిని వధువుగా పేర్కొనటంవల్ల ఆమె అందచందాలు మాత్రమే గణించ బడుతవి—ఏమంటావ్ కల్యాణీ?

[కల్యాణి మాట్లాడదు]

పద్మ:—పెళ్ళికూతుర్ని యీ స్వల్ప విషయాలడిగి సిగ్గు పరచవోక...పై ఎత్తున పెద్ద ముత్తయిదలల్లే మనం ఉండనే ఉన్నాం—

నిర్మ:—చూడండి...అప్లికేషన్ రాసేశాను...

పద్మ. సత్య:—ఏదీ...చదువు...చదువు.

నిర్మ:—ఆన పంధొమ్మిదివందల నలభై తొమ్మిదో సంవత్సరం. ఫిబ్రవరినెల పధ్నాలుగో తారీకున కల్యాణీదేవి-గారి పాదపద్మములకు పెట్టుకున్న దరఖాస్తు—

కల్యా:—పాదపద్మాలేమిటే?

నిర్మ:—హిందూసతికి భర్త పాదపద్మాల ప్రాముఖ్యత తెలియకపోవటం శోచనీయం!

కల్యా:—ఆ సతీత్వమేదో నీకు బాగా అనుభవమల్లే వుంది.

నిర్మ:—ఏదో పురాణాల్లో చదివానులే.

సత్య:—దరఖాస్తు యీ ధోరణిలోనే వుండాలి.

పద్మ:—ఔను...యిలా వుండకపోతే చదువుకున్న ఆడదానికి యెంత గర్వమోనని ఆయన అనుకోగలరు!

నిర్మ:—అదీగాక దరఖాస్తు మంజూరయ్యేదాకానన్నా కొంత నక్కవినయం చూపాలి.

సత్య:—కల్యాణి మరీ అమాయకప్పుదిలేవే! నీకెందుకు, నీవు చదువు—

నిర్మ:—అయ్యో!

సత్య:—'అయ్యో' అనకపోయ్యావా?

పద్మ:—'ఆర్యపుత్రా' అను పురాణఫక్కీలో—

నిర్మ:—వినండే—చంపక; అయ్యో! ది 13-2-1949 వీరాంధ్రలో తాము వేసిన ప్రకటన చూసేప్పటికి నా హృదయం ఝల్లుమంది—

సత్య:—అంటే?

నిర్మ:—ఏమో—నాకేం తెలుసూ? ఆ ఝల్లుమనటం యేమిటో ఆ నాయకికే తెలియాలి.

కల్యా:—నా హృదయం ఝల్లుమన్నదని నీతో చెప్పానా?

నిర్మ:—నీవు చెప్పకపోతేనేం? అలాంటి అనుభూతి లేకుండానే దరఖాస్తు పెట్టుకోవటం యేం సబబు?

సత్య:—చదవ్వే...

నిర్మ:—నేటికికదా నా వూహాపథంలోని వ్యక్తి దొరికాడనే ఆనందంతో వొకింత మూర్ఛిల్లి, తరువాత తేరుకొని యీ దరఖాస్తు పంపుకుంటున్నాను—

పద్మ:—నాయకికి శాస్త్ర శైత్యోపచారాలు చేశామని కూడా ఇరికిస్తే?

సత్య:—ఆ శైత్యోపచారాలు విరహారంగంలో మనకు యెలాగూ తప్పవు—

నిర్మ:—నా అందచందాలూ, ఆకార విశేషాలను గూర్చి యీ కవరులో పంపే ఫొటోనే చెప్పుకుంటుంది. నేను అనాధను...

కల్యా:— ఏమిటే అది ?

నిర్మ:—'అనాథ' అంటే నాధుడు లేనిది : అంటే కన్య అన్నమాట; అదేం తప్పుకాదులే.

పద్మ:—భలే మాట వేశావే ? నిర్మలా ! యీ నాయకుడికి దీనజనరక్షణోత్సాహంవుందో లేదోకూడా తేలుతుంది. ఏదెలావున్నా...కనీసం అనాధ అన్న జాలితోనన్నా, సనాధను చేయవొచ్చు...తరువాత చదువు—

నిర్మ:—నేను చాలా బీదదాన్ని—కట్నాలు పోసి పెళ్ళి చేసుకోలేని నిర్భాగ్యురాలను...ప్రస్తుతం యింటర్మీడియేట్ రెండో సంవత్సరం చదువుతున్నాను...నాకు 'నా' అనే వాళ్ళు లేరు. యీస్థితిలో మీరు నన్ను అర్ధాంగిగా స్వీకరించినట్లయితే, కృతజ్ఞతతో నా విధులను తమకు అత్యంత తృప్తికరంగా నిర్వర్తించగలననే నమ్మకం నాకు వుంది... కనుక యీ అవకాశాన్ని నాకు కల్పిస్తారుగాక...మీ జవాబుతోపాటు, తమ ఫొటోనుకూడా పంపమని ప్రార్థన... ఇట్లు, మీ చరణదాసి...కల్యాణి...

కల్యా:—ఏమిటీ ధోరణి...యేదో వుద్యోగానికి దరఖాస్తుచేస్తున్నట్లుగా—?

నిర్మ:—ఇదీ వొక ఉద్యోగమేనే—జీవితాంతంవరకూ నిర్వహించవలసిన ఉద్యోగం...కానీ సంతకం చేసెయ్.

కల్యా:—ఊహుం. నేను పెట్టను.

సత్య:—మేమింత కష్టపడి దరఖాస్తు తయారుచేస్తే...?

పద్మ:—మనం ఏదో తమాషాకు ఇదంతా చేస్తూంటే కల్యాణి నిజం అనుకుంటోంది.

నిర్మ:—మొదట్లో కాస్త బెట్టుగానే ఉండాలిలేవే!

సత్య:—ఆ బెట్టు పెళ్ళికొడుకుదగ్గర—మనదగ్గరా యేం?

కల్యా:—తమాషాకుమాత్రం మనకెందుకిదంతా?

పద్మ:—చూద్దాం: మన దరఖాస్తుతో ఆవరుడు ఏవిధంగా ప్రవర్తిస్తాడో తెలుస్తుంది...మనం చూసి ఆనందించేందుకు మంచి అవకాశం! కనుక సంతకం చెయ్.

నిర్మ:—కానీ, మళ్ళీ టైం అవుతోంది.

సత్య:—మామాట వింటావా—

[ముగ్గురూ కల్యాణిని చుట్టుముట్టుతారు. ముగ్గురూ అరుస్తూంటే కల్యాణికి ఏమీ తోచదు]

కల్యా:—(పెద్దగా) ఏమిటే ఇదంతా? చెవులు చిల్లులు పడుతున్నాయ్—

[గోల ఆగిపోయింది]

నిర్మ:—మరి సంతకం చేసెయ్—

[విధిలేక అనుమానిస్తూనే కల్యాణి సంతకం చేసేసింది]

సత్య:—ఉత్తరానికి కాస్త పసుపూ, సెంటూ తగిలించండి—

నిర్మ:—ఎందుకులే—ఫలితం తెలియకముందే ఇవన్నీ దేనికి?...సాయంత్రం కల్యాణి ఇంటికి వెళ్ళి ఫోటో తీసుకొని, యీ దరఖాస్తుకు జోడించి పంపుదాం—

సత్య:—పెళ్ళికూతుర్ని చేయటం ఎప్పుడు?

పద్మ:—మా కల్యాణి పెళ్ళికూతురాయనే—

[అందరూ లయ కలుపుతారు. కల్యాణికి కోపం వొస్తుంది; కాని ఆ కోపాన్ని ప్రదర్శించేందుకు వీల్లేకుండా చిరునవ్వు అడ్డుపడుతుంది]

నిర్మ:—పెళ్ళికూతురంటే అప్పుడే యీ మెకు వొళ్ళు పులకరిస్తోందేవ్!

[దూరాన గంట వినిపిస్తుంది]

పద్మ:—టైం ఐంది—క్లాసుకు పదండి.

[అల్లరంటే తెలియని పిల్లల్లే మెల్లిగా అందరూ జారుకుంటూండగా.—తెర]

## III

[మధు స్టుడియో, మొదటి రంగంలోవలెనే అశుభ్రంగా వుంది. సోఫాలో కూర్చొనివున్నాడు. అతని పక్కనే వొక కవర్లకట్ట వుంది. ఇంతకుముందు విప్పిన నల్భయాభై కవర్లలోని కాగితాలూ ఫొటోలూ నేలమీద చిందరవందరగా పడివున్నాయ్.

మధు వొక్కో కవరే విప్పటం, ఫొటోను చూసి నేలకేసి కొట్టటం చేస్తున్నాడు. అతనిముఖంలో విసుగు స్పష్టంగా కనిపిస్తోంది. ఇంకా విప్పవలసినవి వొక యాభైదాకా వున్నవి.

మధుకు ఎదురుగుండా కుర్చీలో దాసు కూర్చొనివున్నాడు; దాసు ముఖంలో కూడా నిరాశ మెరుస్తోంది—]

మధు:—(వెనక్కి ఆనుకుంటూ) ఇంకా విప్పటం అనవసరం. ఇవన్నీ చూస్తుంటే నాకు భయంవేస్తోంది—

దాసు:—చూడు ఆ మిగతావికూడా—

మధు:—నాకు మరి ఓపిక లేదు. యీ ఫోటోలు చూస్తుంటే స్త్రీవ్యామోహం సన్నగిలుతోంది; కనుక చూడకుండా వుండటమే మంచిది. ఓపిక వుంటే నీవు చూడు—నీ హాస్తవాసి మంచిదేమో చూద్దాం.

[దాసు కవర్లజొత్తిని అందుకొని ఒక్కొక్క కవరే విప్పుతూంటాడు! చూసి మధువరకూ వెళ్ళటం అనవసరమన్నట్లుగా విసిరిపారేస్తూంటాడు... మధు కళ్ళు మూసుకొని ఆలోచనలో పడ్డాడు...ఐదారు కవర్లు విప్పాక దాసుముఖంలో ఆనంద తరంగాలు స్పష్టంగా కనిపిస్తవి. ఆగలేక లేచి నిలబడుతాడు...మధు చప్పున కళ్ళు విప్పి, దాసులోని మార్పుకు ఆశ్చర్యపోతాడు.]

మధు:—ఏమిటది? ఇంకా స్నేపు వుంటే నాట్యం చేసేట్లు కూడా ఉన్నావ్?

దాసు:—నిజంగా నాట్యం చేయవలసిన వ్యవహారమే!... కష్టే ఫలే అని పూరికే నే అన్నారా?...అప్సరసరా! అబ్బ! ఎప్పుడో పెట్టిపుట్టావ్—

మధు:—ఏదీ చూడనీ—

దాసు:—ఉండు.....అప్లికేషన్ చూడు. ఎంత బాగా రాసిందో—చదువుతా విను—

మధు:—ముందు ఫోటో చూడనీ—

దాసు:—(ఫోటో అందిస్తూ) జాగర్త...మూర్ఛపోతావేమో?

మధు:—(ఫోటో అందుకుంటూ) యీ కబుర్లకేంలే—

[మధు ఫోటోను చూసి నిలువలొక్కకోలేక లేచి నిలబడతాడు]

దాసు:—పడిపోయ్యేవ్...జాగ్రత్త.

మధు:—ఏదీ అప్లికేషన్ ఇలా ఇవ్వు-(తీసుకొని చదివి) పాపం—ఎంత దీనంగా రాసిందీ!

దాసు:—నాకు తెలుసురా బాబూ! నీ మనసు నవనీతం! అందులోనూ అందమైన యువతులంటే ఇంక చెప్పనక్కర్లేదు.

మధు:—యీ ఆమె నిజంగా నా స్వప్నసుందరి!

దాసు:—అబ్బో! కవిత్వంకూడా మొదలెట్టేట్లున్నావే?

మధు:—ఇలాంటి స్త్రీని పొందిన పురుషుడికి ఒక కవిత్వమేమిటి—ఏ లలితకళ ఐనా ఇట్టే అబ్బుతుంది.

దాసు:—ఐతే సగం పెళ్ళి ఐనట్లే—

మధు:—ఎట్లా?

దాసు:—నీవు ఒప్పుకున్నావ్ కదా? అందుకని సగం ఐపోయిందన్నమాట!

మధు:—అది సరే—తీరా ఆమె ఒప్పుకోకపోతే...?

దాసు:—ఆత్మహత్యకు అనేక మార్గాలున్నయ్...ఆ విషయం నేను చూస్తాగా—నీవేం దిగులుపడక్కర్లేదు. ఏ క్షణాన కావాలన్నా పొటాసియం సైనైడ్‌ను అందించే బాధ్యత నాది!

మధు:—నీలాంటి తెలివైన లాయర్ స్నేహితుడు వుండగా సైనైడ్ అవసరం వొస్తుందనుకోను. ఐనా యీ బాధ్యత అంతా నీదే! నాకు యీ లౌకిక వ్యవహారాలు బొత్తిగా

తెలియవు. నన్ను యెలా యింటివాణ్ణి చేస్తావో మరి? నీట ముంచినా పాలముంచినా నీవే!

దాసు:—అరె పెళ్ళి వొద్దనే వొద్దన్నావుగా! అప్పుడే యిలా జావళ్లే ఐపోతున్నావేం? నామాట విను; 'సంసారం సాగరం దుఃఖం' అన్నారు పెద్దలు. మేమంతా పెళ్లాడి సుఖ పడుతూన్న దేమిటి? అనాలోచితంగా యీ పెళ్ళి చేసు కున్నావంటే మళ్ళీ వెనక్కు వొచ్చే మార్గం వుండదు... అందుకని తొందరపడకు...

మధు:—దీనికి ఆలోచన మరి అనవసరం. ఇన్నాళ్ళూ ఆలోచించకుండానే యింతకాలమూ వృథాచేశాను; ఇప్పుడు యింకా ఆలోచించి మరి కొంతకాలం వృథా చేయమం టావా?

దాసు:—ఇన్నాళ్ళూ లేని తొందర యిప్పుడెందుకోయ్?

మధు:—భూలోకంలోకూడా దేవకన్యలు వుంటారని యెన్నడూ అనుకోలేదు...చూడుభాయీ! యీమె నా అర్థాంగి ఐతే అప్పుడు చూడు...మన చిత్రకళ!

దాసు:—కళ అంటే యీమె బొమ్మలే! అంతేనా!

మధు:—కనుక ముందు వొక వుత్తరం రాయి—

దాసు:—మిగతా దరఖాస్తులుకూడా చూడనీ—యింత కన్న మంచి సంబంధం దొరుకుతుందేమో?

మధు:—అవసరంలేదు...వొకవేళ యింతకన్న మంచి సంబంధం వున్నా, ఆ అతిమంచిని నేను భరించలేను. నాకు యీమే చాలు!

దాసు:—నీ జీవితమే నీకు భారంగా వుంటే, యీమెను వివాహమాడటంవల్ల జీవితం మరింత భారమవుతుంది.

మధు:—ఛా!...అసలు యిలాటి భార్యే వుంటే యెంత బరువైనా తేలిగ్గా లాగిపారెయ్యొచ్చు...(ఫొటోను మరో సారి పరికించి చూసి) యెంత లావణ్యం! చూడు—పాపం! యీ నవమోహనాంగి బీదరికంలో కుమిలిపోతూన్నదంటే-!

దాసు:—అబ్బ! యెంత జాలిగుండె! బీదరికానికీ సౌందర్యానికీ సంబంధం యేమిటోయ్?...నీకు తెలియదూ- ప్రపంచంలో విలువైన రత్నాలు భూగర్భంలోనో, సముద్రపు లోతుల్లోనో, విషసర్పాల శిరస్సులమీదనో వుంటవని?

మధు:—పాపం-యెన్ని ఆశలు పెట్టుకుందో—ముందు జవాబు రాయి—

దాసు:—తొందరేం లే—

మధు:—(బతిమాలుతూ) భాయీ! నన్ను మరి ఏడిపించక జవాబు రాసిపెడుదూ?

దాసు:—ఎలా రాద్దామంటావ్? నీవు రాసినట్లా? నేను రాసినట్లా?

మధు:—నీవే ఆలోచించు: ప్లీడర్ తెలివితేటలు యీ ఉత్తరంలో కనిపించాలి.

దాసు:—నేను రాసినట్లయితే యిలా వుంటుంది:
చి॥ సౌ॥ కల్యాణీదేవికి ప్రసిద్ధ చిత్రకారుడు మధుకుమార్ స్నేహితుడు లాయర్ దాసు వ్రాయునది:

అమ్మాయీ మణీ! నీ దరఖాస్తూనూ, విశేషించి నీ ఫోటోనూ చూడగానే నా మిత్రుడు మూర్ఛిల్లినాడు; తగిన సపర్యలు చేశాక కాని తేరుకోలేదు. నీ మూర్తినే ధ్యానిస్తూ విరహవేదనతో వేగిపోతున్నాడు. యీ చిహ్నాలు ప్రణయం ప్రకోపించటంవల్లనే వొచ్చి వుంటవని అర్థంచేసుకొని యీ వుత్తరం రాస్తున్నాను. నా మిత్రుని శ్రేయస్సు కోరేవాణ్ణి కనుక, నాయందూ నా మిత్రునియందూ దయవుంచి వెంటనే మావాణ్ణి వివాహానికి అంగీకరించి, వొక యింటివాణ్ణి చేయమని కోరుతున్నాను—

మధు:—బాగా లేదు......నేను రాసినట్లయితే యెలా వుంటుందో చెప్తా—

దాసు:—విను : అమ్మాయీ మణీ! నీ సుందరరూపాన్ని చూడగానే కళ్ళు జిగేలుమన్నవి! ప్రసిద్ధ చిత్రకారుణ్ణి చూపులోనే పాదాక్రాంతుణ్ణి చేసుకోగల నీ సౌందర్యాన్ని గూర్చి చెప్పగలిగేటంత కవిత్వం నాకు లేనందుకు యెంతో విచారిస్తున్నాను—నీతో వివాహమయ్యే భాగ్యమే యీ దీనుడికి కలుగుతే, నా జన్మే ధన్యమవగలదనే నమ్మకం నాకు వుంది. కనుక యీ అల్పుణ్ణి, యీ అనాథను, యీ అక్కుపక్షిని వెంటనే కరుణించి అంగీకరించమని నీ పాదాల ముందు మోకరిస్తున్నాను—

మధు:—అక్కుపక్షేమిటీ ?

దాసు:—ప్రియురాలి కరుణను సంపాయించుకునేందుకు నిన్ను నీవు యెంత నీచపరుచుకున్నా ఫర్వాలేదు. అందుకనే

నిన్ను ఆమెముందు మోకరింపజేశాను...శ్రీకృష్ణుణ్ణి సత్య భామ తన్నిందని వినలా? ఆ తరువాత ఆమె పాదం నొచ్చుతే శ్రీకృష్ణుడు దేవుడో అంటూ పాదాన్ని నొక్క లేదా?...యీ బాధలన్నీ వుంటయ్ కనుకనే సంసార మంటే...

మధు:—మరి నీవు రాసినదాంట్లో ఇలాంటి పదాలు వాడ లేదేం?

దాసు:—మధ్య నాకేం? ఆమె అంగీకరిస్తే నాకు వొరిగేదేమిటి? నిరాకరిస్తే పొయ్యేదేమిటి?...లేకపోతే సైనైడ్ సప్లయ్ చేయటం, శవపంచాయితీలో ఒక చెయ్యి వెయ్యటమూను...

మధు:—నీకు యీ పెళ్ళి చెడగొట్టి నన్ను పరలోకా లకు పంపటమో, సన్యాసుల్లో కలపటమో చెయ్యాలని వున్నట్లుంది—?

దాసు:—నాకు అలాంటి దురభిప్రాయం లేదు. నీ వయ సులో ప్రేమ పుట్టిందంటే ఎంత తీవ్రంగా వుంటుందో సూచి స్తున్నాను—'ఎంత ఘాటు ప్రేమయో-ఇంత లేటు వయ సులో—'అని.

మధు:—నన్ను ఏం ఎగతాళి పట్టిస్తావ్ కాని—

దాసు:—నేను కాదు—మరదల్ని రానీ, ఇద్దరమూ కలిసి నిన్ను చెవులు పట్టుకొని ఎలా ఆడిస్తామో?

మధు:—సరే-తెప్పించు మరదల్ని! ఆ తరువాత నీవెట్లా ఆడిస్తే అట్లా ఆడుతాను......నన్ను చంపక ఉత్తరం

రాయరా!...మనం తొందరపడుతూన్నట్లు సూచన కూడా ఇవ్వొద్దు—తెలిసిందా?

దాసు:—ఐతే నాకేం తొందర లేదని రాసేస్తాను—

మధు:—మనను మనం తక్కువచేసుకోకుండా రాయరా బాబూ!

దాసు:—ఐతే నీ అప్లికేషన్ విచారించబడుతూ వుంది. సాధ్యమైనంత త్వరలో ఏ సంగతీ తెలియపరుస్తాం అని రాస్తాను—

మధు:—నీతో ఏది చెప్పినా ప్రమాదంగానే వుందే! అతివృష్టీ అనావృష్టీను! ఏమో—ఏంచేస్తావో? నాకు మరెవ్వరూ లేరు కనుక, యీ పెళ్ళిపెత్తనమంతా నీది! (ప్రార్థనాపూర్వకంగా) చూడు బ్రదర్! ఆత్మబంధువైనా, ప్రాణస్నేహితుడివైనా నీవే కదా! ఎలాగైనా నన్నొక ఇంటివాణ్ణి చేసి పుణ్యం కట్టుకో.

దాసు:—అంత పొగడక్క్లేదు లేవోయ్...సంసారం పెట్టాక అప్పుడప్పుడు విందులు చేస్తూండు—అదే చాలు.

మధు:—పెళ్ళిభోజనాలే విందులకు మొదలనుకో—

దాసు:—అబ్బో, అప్పుడే పెళ్ళికొడుకు కళ మొహంలో తళతళలాడుతోందే! (లేచి నిలబడి) మా మధుగాడు పెళ్ళికొడుకాయనే...

మధు:—(నమస్కరించి) బాబూ! వుత్తరం రాయరా ముందు!

దాసు:—జవాబురాకుంటే ప్రియురాలు తహతహ లాడి పోతుందని యెంత సానుభూతి !

మధు:—సరేకాని రాయరా బాబూ !

దాసు:—ఏం రాయమంటావ్ ? నేను రాసింది నీకు పనికిరాలేదు. కనుక, నీవు చెప్పిందే రాస్తాను.

మధు:—నాకు ఆమాత్రం తెలుస్తే నీసహాయాన్ని అపేక్షించేవాడినా ? ప్రణయలేఖ అంటే యెలా వుంటుందో కూడా తెలియదే : అదీగాక—కాస్త పెళ్ళికొడుకు దర్జా చూపాలంటే—నాకో కార్యదర్శి వున్నట్లుగా నటించాలి—అందుకని నీవు రాసి కింద నేను సంతకం చేస్తే యెంత తీవిగా వుంటుందో ఆలోచించు...

దాసు:—ఐతే నీకు నేను కార్యదర్శినన్నమాట ?

మధు:—ఆంతరంగిక కార్యదర్శివి ! నాతో సమానమైన హోదా; అందుకనే ప్రణయలేఖకూడా నీకు తెలియకుండా, నీచేత రాయబడకుండా బైటికి వెళ్ళేందుకు వీల్లేదు;

దాసు:—ఇన్సల్ట్ ! నేనసలు రాయను.

మధు:—(చెంపలు వేసుకొని) యేదో గడ్డి బుద్ధితిని అలా అన్నాను—

[దాసు పగలబడి నవ్వాడు]

మధు:—అదే...అదే...తొందర్లో అలా అన్నాను... బుద్ధి గడ్డితిని అనాల్సింది...

దాసు:—ఏమోరా-చూడబోతే మీ ఆవిడకు నన్ను గుమాస్తాకిందనే పరిచయం చేయబోయ్యేట్లున్నావ్ ?

మధు:—అలా యెన్నటికీ జరగదు... భాయీ! నీలాంటి మిత్రుని దయలేందే నేనసలు బతకగలనా? పాము చావకుండా, కర్ర విరగకుండా వుండేటట్లుగా రాసి, మనిద్దరం వొకసారి ఆమెను కలుసుకునే యేర్పాటు చేయించు—

దాసు:—ఎక్కడ? యెప్పుడు?... ఇక్కడికి రమ్మంటే?

మధు:—ఇక్కడికి వొద్దు. ఈ హోటలు ఒక్కరోజులో బాగవదు. ఆమె యీ స్థలాన్ని చూస్తే వాంతి చేసుకో గలదు... కాలేజిలో కలుసుకుంటే స్వేచ్ఛగా మాట్లాడేం దుకు వీలుండదు. వుభయులకూ వీలుగా వుండే స్థలం... పార్కులో కలుసుకోవటం మంచిది—

దాసు:—సరే-బాగానే వుంది... మధ్య నేనెందుకూ?

మధు:—ఉండాలిలే! ఆ తొందర్లో నేనేమన్నా నోరు జారితే?

దాసు:—ఆమె చెయ్యిజారుతుంది... రాత్రికి వేడినీళ్ళ కాపు వేసేందుకు నేను సిద్ధంగా వుంటానాయె!

మధు:—అలాంటి ప్రమాదాలు జరక్కుండా నీతో ఇన్సూర్ చేసుకుంటున్నాననుకో, పెళ్ళికొడుకు వొంటరిగా వెళ్ళటం బాగుండదు. పెద్దతల వొకటి వుండటం చాలా అవసరం; అది ఆచారం కూడాను.

దాసు:—సరే తప్పేదేముందీ-మంత్రసానితనానికి వొప్పుకున్నాక—

[గొణుక్కుంటూ ఉత్తరం రాస్తూండగా తెర]

# IV

[కాలేజీలో గరల్స్ వెయిటింగ్ రూం. పద్మావతీ, సత్యవతీ కుర్చీలలో కూర్చొని పుస్తకాలు చూస్తున్నారు. నిర్మల పరుగెత్తుకొంటూ వొచ్చింది; ఆమె చేతులో కవరు వుంది. నిర్మలను వెంటాడుతూ కల్యాణి వొచ్చింది. నిర్మల కుర్చీమీదికి ఎక్కి కల్యాణికి కవరు అందకుండా చేయి పైకెత్తి పట్టింది]

కల్యాణి:—(కవరు అందుకునేందుకు వ్యర్థప్రయత్నం చేసి) ఒకళ్ళ ఉత్తరాలు అలా తీసుకోవచ్చా ?

నిర్మ:—అబ్బో ! యీ ఉత్తరంమీద పేరు నీదే ఐనప్పటికీ, ఇది మనందరికీ సంబంధించిన విషయం—తెలుసా ?

సత్యా:—ఐతే ప్రియునిదగ్గర్నుంచి జవాబు దిగిందన్నమాట ?

పద్మ:—పైన సెంటుగాగింటూ రాసివుందేమో చూడు-

నిర్మ:—ఏమో-తీరా విప్పిచూస్తే అమ్మాయి నచ్చనందున సానుభూతిగా కార్చిన కన్నీటిమరకలు ఉంటవేమో ?

కల్యా:—ఏముంటేనేమే-అదంతా నా వ్యక్తిగత వ్యవహారం-తెలుసా ?

నిర్మ:—తెలుసులే!...ఆగు ! అలా కదపబోక. వరుని ఎడ్రస్ చూడనీ...మధుకుమార్, ఆర్టిస్ట్, మెడ్రాస్ 18.

కల్యా:—(గట్టిగా ఊపిరి పీల్చి) నిజంగానా ?...మధు... ఏదీ ఇట్లా యివ్వు.

నిర్మ:—చేతికిమాత్రం ఇవ్వను. ఇదుగో చూడు......

[అక్షరాలు కనిపించేట్లుగా కవరు ఎత్తిపట్టింది]

కల్యా:—(ఆదుర్దాగా) నిర్మలా! ముందు నన్ను చూడ నివ్వవే! నీకు పుణ్యం వుంటుంది.

సత్య:—అబ్బో! కల్యాణి స్వప్నసుందరుడే ప్రత్యక్ష మైనట్లున్నాడే! మధు చిత్రాలంటే చెవికోసుకునే కల్యాణికి ఆతనే వరుడు కావటం ఎంత అదృష్టం!

పద్మ:—కల్యాణికి బొత్తిగా లౌకికం తెలియదే! పెళ్ళి కూతురు ఎంత సిగ్గుపడాలి! తల వొంచుకొని తనకు పట్ట నట్లుగా కూర్చోవొద్దూ? మనసులో ఎంత ఆరాటమైనా ఎంత గంభీరంగా ఉండాలి! యీ విధంగా పెళ్ళికొడుకుదగ్గిర ప్రవర్తిస్తే, కాస్తన్నా బెట్టుచూప నిదానికి ఏం విలువ వుంటుంది? ఇలాఐతే ఉత్తరంలో రాసుకున్న పాదదాసీత్వం కల్యాణికి ఎటూ తప్పదు.

కల్యా:—ఉత్తరం నేను రాశానా యేం? మీరే రాశారు.

పద్మ:—అందుకని జవాబుకూడా మేమే చూసుకుంటాం. అంత బలవంతంగా నీచేత రాయించాల్సిన అవసరం మాకేం? ఐందేమో ఐంది, ఈ వ్యవహారం నీ వొంటికి బొత్తిగా పడదు కనుక, నీవు దూరంగా వుండటమే ఉభయులకూ క్షేమకరం.

కల్యా:—(ఉడికి) మొదట కవ్వించటం, ఆ తరువాత ఇలా ఏడిపించటం...

పద్మ:—ఊరుకోండే! పెళ్ళికూతుర్ని కాస్త సంతోషంగా ఉండనివ్వండే!

నిర్మ:—మీరంతా కాస్సేపు నిశ్శబ్దంగా వుంటే ఉత్తరం చదువుతాను—

[విధిలేక కల్యాణి కుర్చీలో కూర్చుని ఆతృతతో చూస్తూవుంటుంది. మిగతావాళ్ళుకూడా నిర్మల చదవబొయ్యేదాన్ని గూర్చి వినేందుకు కుతూహలం చూపుతూవుంటారు. నిర్మల కవరు చింపి, కాగితాన్ని చేతితో పట్టుకొని, ముద్దుపెట్టుకొని, మడతలు విప్పి, ఖాళీకవరు విసిరిపారేస్తుంది. ఆ తరువాత ఆమె ఉత్తరాన్ని చదువుకుంటూ తనలోతాను నవ్వుకుంటుంది. మిగతావాళ్ళకు అర్థంగాక, ఒకరిమొహాలు వొకళ్ళు చూసుకుంటారు.]

సత్య:—పండా ? కాయా ?

పద్మ:—పైకి చదవ్వే—

నిర్మ:—ముందు వరుని రూపవిశేషాలు పరికించండి—

[ఫొటో యెత్తి కల్యాణికి తప్ప, మిగతా అందరికీ చూపుతుంది]

సత్య: —కన్ను కాస్త మెల్లల్లే వుందే!

పద్మ:—చెయ్యి కాస్త అవుకనుకుంటాను.

కల్యా:—(కోపంతో) యేదీ నన్ను చూడనివ్వండి—

నిర్మ:—వరుని విషయం మేము పరిశీలించేప్పుడు, తల వొంచుకొని సిగ్గుపడటం వధువు కనీస ధర్మం. ఇలా తెగబడే దానికి సంబంధం దొరుకుతుందీ? గయ్యాళిగంప అనుకోరూ?

కల్యా:—ఏడిశావ్ కాని, ఆ ఫొటో ఇలాఇవ్వ...

పద్మ:—ఇలా మాట్లాడటం పెళ్ళిపెద్దలమైన మాలాంటి పెద్దముత్తయిదువుల్ని అగౌరవించటమని తెలుసా ?

కల్యా:—అప్పుడే ఇదొక కల్యాణమైనట్లూ, మీరంతా పెళ్ళిపెద్దలైనట్లూనా ?

పద్మ:—కాక ? యీ సంబంధాన్ని పట్టుకొచ్చింది మేము! పెళ్ళిచేయించేదీ మేమే! ఏదో నామమాత్రంగా నీవలా వుండు.—తెలిసిందా ?

కల్యా:—(బతిమాలుతూ) నిర్మలా! ఆ ఫొటోను ఒక్క సారి ఇలా ఇవ్వవే...

సత్య:—ఇయ్యవే పాపం...ఇప్పట్నుంచే విరహవేదన ఆరంభం కాబోలు! విసిగి సపర్యలు చేయవలసివస్తుందేమో—ఖర్మం!

[కల్యాణి ఫొటోకోసం చెయ్యిజాపుతుంది. నిర్మల ఫొటోను అందించి నట్లే అందించి, వెనక్కి లాక్కుంటుంది. కల్యాణి మరింత కోపంతో ఫొటోను బలవంతాన లాక్కొని ఒక మూలకు వెళ్ళి పరిశీలించి చూస్తుంది. ఆమె ముఖంలోని ఆనందమే ఫొటోనుగూర్చిన ఆమె అభిప్రాయాన్ని చాటుతుంది...తన యీస్థితిని సఖులు గమనిస్తున్నారేమోనని కల్యాణి భయపడుతూ ముఖం పైకెత్తుతుంది. ఆమె అనుమానించినంతా ఐంది. నిశ్శబ్దంగా అందరి కళ్ళూ తనమీదనే కేంద్రీకరించబడి ఉన్నవి. కల్యాణి ముఖం పైకెత్తగానే అందరూ పకాలున నవ్వారు. తానేదో నేరం చేసి నట్లుగా కల్యాణి తల వొంచుకుంది. కాని వెంటనే పస్తాయించుకొని—]

కల్యా:—ఎందుకే పెంకులు ఎగిరేట్లుగా అలా నవ్వుతారు ?

సత్య:—నవ వధువు అవస్థ చూసి!

పద్మ:—అమ్మాయ్! వరుడు నచ్చినట్లేనా ?

[కల్యాణి మాటాడకుండా యీ ప్రశ్న వేసినందుకు పద్మవైపు చురచురా చూస్తుంది]

నిర్మ:—ఔను...ముందు ఆ సంగతి తేల్చుకోండి. అది తేలకుండానే యీ వ్యవహారాన్ని ముందుకు సాగించటంలో

అర్థంవుండదు. కల్యాణికి వరుడు నచ్చనట్లయితే యీ ఉత్త రాన్ని ఇక్కడే చింపేసి, సమాప్తిచేస్తాను.

పద్మ:—అంత బాహాటంగా తన అంగీకారాన్ని ఇస్తుందటే? మీరుండండి... నేనువెళ్ళి తెలుసుకొని వొస్తాను.

[వయ్యారంగా కల్యాణిదగ్గిరికి నడిచివెళ్ళి రహస్యంగా ఆమెను అడుగుతుంది. కల్యాణి మాట్లాడదు]

పద్మ:—పోనీ—నోటితో చెప్పవొద్దులే...నా కుడిచేతిని తాకితే నచ్చినట్లు, ఎడమచేతిని తాకితే నచ్చనట్లూను... సరేనా ?

[కల్యాణి నెమ్మదిగా పద్మ కుడిచేతిని తాకుతుంది]

పద్మ:—వరుడు నచ్చినట్లేనే!

నిర్మ:—మెల్లకంటివాడా ? నవమన్మథుల్లాంటివాళ్ళు వెంటపడినా నిరాకరించిన కల్యాణికి !

సత్య:—ఒకు చేతివాడే నచ్చాడా ?

కల్యా:—(కోపంతో) ఎందుకీ అధికప్రసంగాలు! ఆ వుత్తరం యిలా యివ్వు!

నిర్మ:—పెళ్ళి కాకముందే వరునిమీద యీగనుకూడా వాలనిచ్చేట్లు లేదు...పెళ్ళయ్యాక పొరపాటునన్నా మనను పలకరిస్తుందో, లేదో ?

కల్యా:—(కోపంతో) ముందు ఆ వుత్తరం యిలా యివ్వు—

నిర్మ:—చదువుతున్నాను వినండి—

(గొంతు సరిచేసుకొని) అమ్మాయీ మణీ! ఫొటోను చూస్తేనే గర్వం అనేది నీకు వుగ్గుపాలతో పెట్టినట్లు స్పష్టమౌతోంది. అంత గర్విష్ఠిని పెళ్ళాడి నేను సుఖపడేదేమిటి? ఫొటోను పరిశీలించి చూడగా నీది సొట్టముక్కని అర్థమౌతోంది—

సత్య:—(నవ్వి) మొనగాడే! యెలాగైనా చిత్రకారుడు కదూ యిట్టే గ్రహించాడు.

పద్మ:—దీనికి మనం జవాబు రాద్దాం. పెళ్ళికి ముందుగానే వధువు ముక్కులోని సొట్టకు మాటు వేయిస్తామని తెలియపరుద్దాం.

నిర్మ:—ఇంకా వినండి—ఫొటోలో నోరు మూసివుంది. ఐనప్పటికి నోరు తెరుస్తే ఒకటి రెండు పళ్ళయినా వూడి వుంటయ్యనే నమ్మకం నాకు కలుగుతోంది.

సత్య:—భలే! మన బోసినోటి పెళ్ళికూతురుకు బంగారపు పళ్ళు కట్టించాల్సిందే!

పద్మ:—ఇంతమంది మొగాళ్ళకు కనిపించని యీ అపలక్షణాలన్నిటినీ ఫొటోలోనే యెంతబాగా కనిపెట్టగలిగాడు!

నిర్మ:—అనాథనని రాశావు. నాకూ్కడా యెవ్వరూ లేరు. ఇద్దరు అనాథలు ఒక్కచోట జేరటం—ఇద్దరు జోగులు రాచుకోవటంలాటిది!

సత్య:—జీవితమంటే యేమిటో తెలిసిన వ్యక్తి!

నిర్మ:—ఇంత నిశిత విమర్శకుణ్ణి పెళ్ళాడి సుఖపడేదేమిటి? తీరా పెళ్ళయ్యాక, మేమందరం కలిసి యీ పెళ్ళి చేసి

నందుకు, మా జీవాన పడి యేడవాల్సివుంటుంది. ఇంక చద వటం అనవసరం కనుక, ఉత్తరాన్ని చింపి పారేస్తాను.

[నిర్మల ఉత్తరాన్ని చింపేందుకు ప్రయత్నిస్తూండగా కల్యాణి చప్పున ఆమె చేతిలోని ఉత్తరాన్ని లాక్కొని ఒకమూలకు వెళ్ళి ఆత్రుతతో చదువుకుంటూవుంటుంది. సత్యవతీ, పద్మావతీ, నిర్మలచుట్టూ జేరి గుస గుసలు మొదలుపెడతారు.]

నిర్మ:—యీ సాయింత్రం వధూవరుల మధ్య పెళ్ళి చూపులు జరుగుతవి.

సత్య:—ఎక్కడా ?

నిర్మ:—పార్కులో...దక్షిణపు వైపున.

పద్మ:—ఐతే మధ్యాహ్నం కాలేజికి సెలవుపెట్టయినా వధువును అలంకరించాల్సి వుంటుంది.

కల్యా:—(మూతి ముడిచి) అలంకరణలేమీ అక్కర్లేదు...

సత్య:—నీకు తెలియదే పిచ్చిమొద్దూ! పెళ్ళికి ముందు వరుడు వధువును నఖశిఖపర్యంతమూ ఎంత నిశితంగా చూస్తాడో తెలుసా ?

కల్యా:—ఐనా సరే—

(బతిమాలుతూన్నట్లు) మీరంతా నాకు సహాయం చెయ్యాలే !

పద్మ:—పెళ్ళిపెద్దలకు బాధ్యతలు తెలియవనుకుంటున్నావా ?

నిర్మ:—అసలు దరఖాస్తు పెట్టేందుకే ఎంతో బలవంతం చెయ్యాల్సివొచ్చిందిగా ?

సత్య:—మొదట్లో బెట్టులేవే! ఇలాటి సంబంధాలు దొరక్క మీరిద్దరూ వూరుకున్నారు కాని, లేకపోతే యీ పాటికి బిడ్డలతల్లులు అయేవాళ్ళు కారటే?

పద్మ, నిర్మ:— అబ్బో! మా ఇద్దరికీ వున్న ఆశ నీకు ఒక్కటెకూ లేదంటే ఎవరు నమ్ముతారు?

కల్యా:—ఉండండే! మీ అందరి ఉత్సాహాలూ యీ సమస్యను భేదించటంలో చూపండే; కోఆపరేటివ్ పద్ధతి మీద వివాహాలు చేసుకునే పద్ధతిని మనం ప్రవేశపెడదాం...

సత్య:—అంటే?

కల్యా:—మీరు ముగ్గురూ నాకు సహాయం చేసినట్లే, మనలో ప్రతిఒక్కరికీ మిగతా ముగ్గురూ సహాయంచేసి పెళ్ళి చేయిస్తారన్నమాట.

పద్మ:—పెళ్ళయాక మమ్మల్ని మరచిపోతావేమో?

కల్యా:—నేనా? అట్లా ఎన్నటికీ జరగదు. ఇంకా విను: యీ వివాహమే ఐతే దంపతులిద్దరం సహాయం చేస్తాం.

నిర్మ:—ఇంకేమే! వాళ్ళ ఆయనచేత మనందరి చిత్రాలూ అద్భుతంగా రాయించి, దేశదేశాల రాజకుమారులకూ పంపుతుంది. ఇంతకూ పద్మావతికూడా పెళ్ళయే రోజులు దగ్గర్లోనే ఉన్నయ్. ఇవాళ పద్మ కల్యాణికి తోడి పెళ్ళికూతురు!

కల్యా:—నాకు మీరు ముగ్గురూ తోడిపెళ్ళికూతుళ్ళే!

పద్మ:—అవతల ఆయన ఎంతమంది తోడి పెళ్ళికొడుకుల్తో తరలివొస్తున్నాడో?

సత్య:—నాకు తెలియక అడుగుతాను—ఆయన యే పార్కులోకో వొచ్చి కలవమన్నాడనుకో—అంతమాత్రం చేత బుజాలు యెగరేసుకుంటూ పరుగెత్తటమేనా ?

పద్మ:—ఇందులో ప్రమాదం యేముందీ? నీడల్ని చూసి మోసపోకుండా, వ్యక్తులే ఒకర్నొకరు పరిచయం చేసుకుంటారు. కాబోయే దంపతులు వొకర్నొకరు అర్థం చేసుకోనక్కర్లా ?

నిర్మ:—బెట్టు పోవటంలేదటే ? ఇవాళ వెళ్ళకుండా మరో రోజుకు వాయిదా వేయటం, యేదో సాకు చెప్పి వెళ్ళకుండా వూరుకోవటం—యీ విధంగా ఐదారుసార్లు చేస్తేనే కాని, వరుడు తహతహలాడి, ప్రణయం పాపం పెరిగినట్లు పెరగదు ! కాలేజిలోని యువకుల్నందర్నీ కవ్వించి, ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తూన్న కల్యాణి లాంటి జాణకు మొగాళ్ళ మనస్తత్వం తెలియకపోవట మేమిటి ?

కల్యా:—ఈయన అందరిలాంటివాడు కాదే ! వెళ్ళక పోతే యేమనుకుంటారో ?

నిర్మ:—ఎంత సానుభూతి ! పురుషులంటేనే ద్వేషించే కఠినురాలు కల్యాణి యిలా జావల్లే ఐపోతోందేం ?

సత్య:—నా అనుమానం ఏమంటే-కల్యాణి యీ ధోరణి లోనే వుంటే పెళ్ళిచూపులు గాంధర్వ వివాహందాకా పోతయ్యేమో ?

నిర్మ:—అందుకనే కల్యాణివెంట ఎప్పుడూ ఒకళ్ళన్నా వుండాలి.

పద్మ:—మనకా శ్రమ అక్కర్లేదు...కల్యాణి నీడల్లే ఆమె మేనబావ బ్రహ్మానందం గారు ఉండనేవుంటారు! ఇతర పురుషులు కల్యాణిని చూస్తేనే చుంచులాగు మూతిపెట్టి వాళ్ళను కరిచేందుకు సిద్ధంగానే వుంటాడు !

కల్యా:—ఔనే...వాడొకడూ పానకంలో పుడకల్లే ! వాణ్ణి వొదిలించుకోవటం ఎలా ?

సత్య:—పాపం! నీమీద కొండంత ఆశతో నీకొంగు పట్టుకొని వేళ్ళాడుతూ వుంటాడుకదా—అతనికి యింత అన్యాయమా !

కల్యా:—సరేలే—నీ వేదాంతాని కేమొచ్చె? తనకు మాలిన ధర్మమాయేం?...ఆఁ నాకొక మంచివుపాయం తడుతోంది. నాతో ఒకళ్ళు సాంకేతిక ప్రదేశానికి రండి. మిగతా యిద్దరూ బ్రహ్మంగాడితో మాట్లాడుతూ, మేము తిరిగి వొచ్చేదాకా వాణ్ణి కదలకుండా చూడండి.

పద్మ:—నీతో ఒకళ్ళు ఎందుకంట? మీ ప్రణయ భాషణలు విని మనసులో ఆరాటం, పోరాటం జరిపించుకునేందుకా ?

కల్యా:—అలా ఉండకపోతే బ్రహ్మం అనుమానిస్తాడు. అదీగాక పరాయిమొగాడితో ఒంటరిగా మాట్లాడటం బాగుండదుశే !

పద్మ:—కాబోయే భర్త పరాయివాడుగాడేమిటి ?

సత్య:—తీరా యీ సంబంధాన్ని కష్టపడి కుదుర్చుతా మనుకో...కల్యాణి తండ్రి ఒప్పుకోకపోతే ?

కల్యా:—ఆ అనుమానాలు మీకు అక్కర్లేదు. పెళ్ళి విషయంలో మా నాన్న నాకు కావలసినంత స్వేచ్ఛను యిచ్చాడు. వరుణ్ణి ఎన్నుకోవటం నా వొంతు—

సత్య:—మనుమల్ని ఎత్తుకోవటం ఆయన వంతూను !

కల్యా:—వేళాకోళాలు ఆపి జరగవలసింది ఆలోచించండే !

నిర్మ:—ఏముందీ ? సాయంత్రం నాలుగున్నరకల్లా ఆడ పెళ్ళివారు బ్యాండుమేళాల్తో తరలివెళ్తారు.

పద్మ:—ఆ తరువాతి కార్యక్రమం వెంటనే అందుకుంటుంది.

కల్యా:—ఆయనతో ఏం మాట్లాడాల్సివొస్తుందో, ఎలా మాట్లాడాలో తెలియటంలేదు.

సత్య:—ఆ సమయానికి దానంతట అదే తెలుస్తుంది.

నిర్మ:—(కల్యాణి వీపు తట్టి) మరేం గాబరా పడవోకవే !...అంతా సక్రమంగానే జరుగుతుంది. పద్మ నీకు తోడుపెళ్ళికూతురల్లే ఉంటుంది. నేనూ సత్యవతీ బ్రహ్మన్ని కదలనివ్వం...వధువు తొందరపడకుండా ఆమెను కాపాడే బాధ్యత పద్మది...

కల్యా:—(ధైర్యంగా) మీలాంటి స్నేహితురాండ్రు వుంటే నాకు భయమేమిటి? మీ సామర్థ్యం చూస్తే ఎన్ని పెళ్ళిళ్ళయినా చేయించగలిగేట్లు వున్నారు.

సత్య:—మనం ఉత్తరంలో రాసినదానికి సరిపడేట్టుగా కల్యాణి బీదదల్లే కనిపించాలి. ఈ సిల్కుచీరెలూ, ఆభరణాలూ పనికిరావు. ఇంటికివెళ్ళి కాట్టేడి చీరె కట్టి...

పద్మ:—నిజమే నేవ్! చీరె ఫర్వాలేదు. ఏదో వున్న గుడ్డల్లో మంచిగుడ్డలు వేసుకొచ్చిందని వరుడు సరిపెట్టుకో వచ్చు.

సత్య:—అలాఐతే నగలుమాత్రం ఏం అడ్డం? యివన్నీ రోల్డ్‌గోల్డ్‌వని ఆయన సరిపెట్టుకోవొచ్చు; లేదా ఆయన పొరపడకుండా ముందుగానే మనం చెపితే సరిపోతుంది.

పద్మ:—నగలు లాభంలేదు...ఆ కాస్సేపూ వాటిని నేను ధరిస్తే సరిపోతుంది.

కల్యా:—సరే...ఏదో ఒకటి చేద్దాం...

[గంట వినిపిస్తుంది]

ముందు క్లాసులోకి పోదాం రండి—

[అందరూ మెల్లిగా వెళ్తూండగా తెర]

## V

[పార్కు గేటుదగ్గర...జనం అప్పుడప్పుడు వెళ్తూండటం, వొస్తూండటం కనిపిస్తుంది. త్వరత్వరగా కల్యాణీ, పద్మా వొచ్చారు. వొచ్చిన వాళ్ళు ఆగి, కర్తవ్యాన్నిగూర్చి ఆలోచించసాగారు. ఇంతకు పూర్వం కల్యాణి శరీరాన్ని అలంకరించిన నగలు, ఇప్పుడు పద్మ ధరించింది. ఆభరణాలు లేనందువల్ల కల్యాణి సహజసౌందర్యం బైటపడుతూవుంది.]

కల్యాణి:—భలే ఎత్తు వేసి బ్రహ్మాన్ని వొదిలించావే.

పద్మ:—ఎత్తేముందీ? వాళ్ళు కాఫీకని వెళ్తాంటే, ఆకలిగా వున్నా మనిద్దరికి అక్కర్లేదని వొచ్చేశాం. ఒక సుఖంకోసం కొన్ని కష్టాలు పడక తప్పదు. బ్రహ్మాం తిండి తప్ప మరేదన్నా త్యాగం చేస్తాడు కనుక, తీరిగ్గా కూర్చొని తినుబండారాలమీద దాడి సాగిస్తూవుంటాడు.

[చంకలో తాటాకుల గ్రంథంతో, దారాలతో బిగించిన కళ్ళజోడుతో ఒక ముసలి జ్యోతిష్కుడు వొచ్చాడు]

జ్యో:—అమ్మాయిలూ! జ్యోతిషం చెపుతాను—

పద్మ:—ఔనే కల్యాణీ! చెప్పించుకోవే...

కల్యా:—నాకేం అక్కర్లేదు.

పద్మ:—నీకు తెలియదే పిచ్చిమొద్దూ! శుభకార్యానికి ముందు శాస్త్ర మంచిచెడ్డలు ఆలోచించాలి. అందులోనూ మనం బయలుదేరేముందు పంచాంగమన్నా చూడలేదు. వర్జం, గిర్జం ఏమైనా వుందేమో—ఖర్మం?

జ్యోతి:—ఇవ్వమ్మా! చెయ్యి ఇటివ్వు—

[తన చేతిని పద్మవైపు జాపుతాడు]

పద్మ:—నాకెందుకు...యీమెకు చెప్పు.

[పద్మ బలవంతంగా కల్యాణి చేతినిలాగి, జ్యోతిష్కునిముందు పెడుతుంది]

జ్యోతి—(పరీక్షగా చూసి) ఏం అదృష్టం! కోటీశ్వరుల ఇంట పుట్టిఉండాల్సింది...

పద్మ:—పెళ్ళివిషయం చెప్పవయ్యా!

జ్యోతి:—యీ సంవత్సరంలోనే కల్యాణయోగం వుంది...

పద్మ:—బిడ్డల సంగతికూడా—

[కల్యాణి తనచేతిని చప్పున లాక్కుంటుంది]

కల్యా:—ఏమిటే—మరీను ?

పద్మ:—పెళ్ళంటూ అయాక బిడ్డలు పుట్టకుండా వుంటారా యేం ?

కల్యా:—(కోపంగా) నీ వేళాకోళం శృతిమించి రాగాన పడుతోంది.

పద్మ:—అట్లాగైతే నేను వెళ్ళిపోతాను. నీ అవస్థ నీవు పడు.

కల్యా:—పద్మా! ఏదో కోపంలో అన్నాను. క్షమించవే!

పద్మ:—నాకు తెలుసులే. యీ కోపాలు రానటం అవసరంకొద్దీ వెంటనే క్షమార్పణలు వేడటం...

కల్యా:—స్నేహితురాల్ని ఇలా వొదిలిపెడతావా ? బతిమాలుతున్నాగా ! నీ పెళ్ళికి పెద్దరికం వహించి అంతా నేనే చేస్తానుగా—తెలిసిందా ?

పద్మ:—అక్కర్లేదులే! నీకు పట్టిన అవస్థే నాకు పట్టకుండావుంటే అదేచాలు.

కల్యా:—ముందు యీ జ్యోతిష్కుణ్ణి వొదిలించు.

జ్యోతి:—చెయ్యి ఇలా ఇవ్వమ్మా! సంతానయోగం చూస్తాను.

పద్మ:—అది ఆమే చూసుకుంటుంది కాని, ఇక నీవు దయచెయ్.

[పద్మ ఒక పావలా ఇచ్చి జ్యోతిష్కుణ్ణి పంపేస్తుంది]

అటుపోయి, వరునితాలూకు జనం దిగారేమో చూసి వొస్తానుకాని, నీవు ఇక్కడే వుండు...

కల్యా:—త్వరగా రావేవ్! నాకు ఒక్క తెకూ భయం.

పద్మ:—రుక్మిణీ కల్యాణంలోలాగు వరుడు నిన్ను ఎత్తుకొనిపోడులే—

[పద్మ నిష్క్రమించి, వెంటనే తిరిగి వొచ్చింది]

కల్యాణి:—వొచ్చారా?

పద్మ:—బంధుమిత్ర పరివారంతోసహా దిగారు. నన్ను చూడగానే, లేచి నిలబడ్డారు కాని, తీరా దగ్గిరికి వెళ్ళాక, నిట్టూర్చి కూలబడ్డారు.

కల్యా:—అంటే ఎంతమంది దిగారేమిటి?

పద్మ:—చూడు-ఆ పొదలచాటున వున్నారే-ఇద్దరూ—

కల్యా:—(చూసి) ఎక్కడా?

పద్మ—అదుగోనే ఆ పొన్న చెట్టుకింద......కాలు కాలిన పిల్లల్లే అటూ ఇటూ తిరగటంలా? ఆ సిల్కు లాల్చి...

కల్యా:—ఆఁ.

పద్మ:—ఆయనే వరుడు. ఏ నాలుగింటినుంచో కాపలా వేసివుంటారు. ఆ రెండో ఆయన చూడు...పాలరాతి అరుగు మీద కూర్చున్నాడే...సీమ బాదం కాయల్లే-బహుశా ఆయన తోడిపెళ్ళికొడుకై వుంటాడు.

కల్యా:—ఇద్దరేనా? ఇంకెవరైనా ఉన్నారా?

పద్మ:—ఆ ప్రాంతంలో మరెవ్వరూ లేరు కాని... వెళ్దాం పా...మళ్ళీ బ్రహ్మం వొచ్చేప్పటికి మనం ఇక్కడ వుండాలి.

కల్యా:—ఏమోనే నాకు చాలా భయంగావుంది. చెమట కూడా పోస్తోంది...

పద్మ:—మొహం తుడుచుకో...నగలూ, నాణాలూ లేవని భయపడవోక. అవేవీ లేకుంటేనే నీ సహజ సౌందర్యం బైటపడుతోంది. నిజం చెప్పాలంటే నేనే పురుషుణ్ణయితే, నిన్ను మధుకుమార్ దాకా పోనిచ్చేవాణ్ణా?

[కళ్యాణిబుగ్గ గిల్లుతుంది]

కల్యా:—ఛా! ఊరుకోవే!...ఎట్లా మాట్లాడాలో—

పద్మ:—మరేం భయంలేదు రద్దూ—

కల్యా:—ఏమోనే-అందులోనూ ఆ నల్లకోటు ఆయన్ను చూస్తే నాకు మరీ భయంగా వుంది—

పద్మ:—దేవీ తమర్ని అక్కడికి జేర్చి, నేనూ ఆ నల్లకోటు ఆయనా తప్పుకోక తప్పేదేముందీ?

కల్యా:—నీవు లేకుంటే నేనసలు ఒంటరిగా ఉండలేను.

పద్మ:—ఒంటరితనం ఏముంటుందీ? మనోహరుడు మధుకుమార్ ఉండనే ఉంటాడుగా? ఆలస్యం అమృతం విషం—కనుక రా—

[బలవంతంగా కళ్యాణిని లాక్కువెళ్తుండగా తెర]

## VI

[తెర లేవగానే పార్కులో ఒకమూల, పొన్నచెట్టుకింది తిన్నెమీద దాసు తాపీగా కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. మధు పార్కు అన్ని వైపులా ఆతృతగా చూస్తూ, అటూ ఇటూ తిరుగుతున్నాడు.]

దాసు:—కూర్చోవోయ్! ఎంతసేపు తిరుగుతావ్! కాళ్ళు నెప్పులు పుట్టటంలా?

మధు:—డ్యూటీ స్వామీ!...ఏ ఆడదాన్ని చూసినా కల్యాణీదేవనే అనిపిస్తోంది.

దాసు:—ప్రణయపైత్యంరా బాబూ! కళ్ళకువొచ్చే పసికర్లలాంటిది...ఎండనుచూచి వెన్నెలనుకోవటం, కాకి కూస్తే కోయిలని భ్రమించటం ఇంకా ఇలాటివే—లేకపోతే ఐదింటికి ఎంగేజ్ మెంట్ పెట్టుకొని, నాలుగింటికే నా ప్రాణం తీసి లాక్కొస్తావా?

మధు:—ఒకవేళ ఆమె కాస్తముందుగా వొస్తే ఎంత అసహ్యంగా వుంటుందీ!

దాసు:—అబ్బో! ప్రణయఫలం అంత తేలికనుకుం టుందా యేం? ఏం కాస్త ఆలస్యమైతే వేచిఉండేది... ఇప్పుడు నీవు పడివుండలా?

మధు:—లేడీస్‌ను అలా బాధపెట్టకూడదు భాయీ!

దాసు:—మాకు తెలుసులేవోయ్... మొదట్లో మొగాడు ఆడదాన్ని కింద నడవనీడు.

మధు:—అందులోనూ కల్యాణీదేవి విషయంలో నీవీ విధంగా మాట్లాడుతున్నావంటే—నీదెంత కఠిన హృదయమో...

దాసు:—పెళ్ళికాకముందే మరదలుపిల్లమీద యీగనుకూడా వాలనిచ్చేట్లు లేవే?...సరే ఏమైనా కా. ఆమె వొస్తుందనే ఆశ నాకు మరిలేదు. కనుక నేను పోతాను.

[లేచి నిలబడతాడు]

మధు:—(బతిమాలుతూ) బాబ్బాబు! నిన్ను నమ్ముకొనే నేనీ వ్యవహారంలోకి దిగాను. నన్నిలా నట్టేట్లో ముంచుతే—?

దాసు:—బాగానే వుంది...ఇదేమన్నా బెడిసికొడితే అదంతా నా హస్తవాసే అనేట్లున్నావ్.

మధు:—అట్లా అనను...ఏదో నాకు చేదోడువాదోడుగా వుంటే అదే చాలు...

దాసు:—(కూర్చుంటూ) నాకేం నమ్మకంలేదురా అబ్బీ! బహుశా నీ ఫోటో చూశాక ఆమె నిరాకరించి వుంటుందనుకుంటాను. లేకపోతే ప్రేమికుడిలో కనిపించే తొందరా, వేడీ ప్రియురాలిలో కనిపించకపోవటమేమిటీ—?...యీ వృథా ప్రయాస ఎందుకుకాని, ఇంటికి పోదాంపా...రేపొద్దున ఇంటికి ఉత్తరం వొస్తుందిలే!

మధు:—ఇంకాస్సేపు చూద్దాం...నిజంగానే నిరాకరిస్తుందంటావా?

దాసు:—అనే నా నమ్మకం. ఆమె రూపం చూస్తే ఇట్టే మూర్ఛబొయ్యేట్లుగా వుందా-అలాంటి అప్సరసను. నీ రూపం ఏం నచ్చుతుందనే అనుమానం నాకు మొదటినుంచీ వుంది—

మధు:— నేను కురూపినంటావా ?

దాసు:—అహా ! నవమోహనాకారుడివి! సౌందర్యాన్ని మెచ్చుకోవటం, సౌందర్యాన్ని చిత్రించటం నీకు తెలుసు; కాని నీ అందాన్ని గూర్చి ఎన్నడూ ఆలోచించినట్లు లేదు... ఆ చప్పిడపడలూ...

మధు:—(బుగ్గలు నొక్కుకుంటూ) చప్పిడపడలా ?

దాసు:—ఆ మెల్లకన్నూ—

మధు:—నాది మెల్లకన్నా ?

దాసు:—ఆ తొంటిచెయ్యీ—?

మధు:—ఆఁ, ఇన్ని అవలక్షణాలు నాలో ఉన్నయ్యంటావా ?

దాసు:—నేను అనటం దేనికీ ? అద్దంచూసుకో—

మధు:—అద్దంచూసుకొని ఎంతో అందమైన వాణ్ణను కునేవాణ్ణి.

దాసు:—ఎవరికివాళ్ళు అందంగానే కనిపిస్తారు. నా ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకుంటే, ముద్దొచ్చేట్లుగావుంది... కాని యీ స్త్రీ దృష్ట్యాచూస్తే...?

మధు:—అంతేనంటావా ? నాయీ రూపాన్ని యీ క్షణంలో నిందించుకుంటూన్నంతగా ఎన్నడూ నిందించుకో లేదుసుమా !

దాసు:—ఒకసమయంలో అద్భుతంగా కనిపించిన విష యాలే వేరొక సమయంలో అసహ్యంగా తయారవుతవిరా అబ్బీ !

మధు:—ఏది ఏమైనా నాకో ధైర్యంవుంది.

దాసు:—ఏమిటది ?

మధు:—నీ బొందిలో ప్రాణం వున్నంతవరకూ, నీ తెలివి తేటలవల్లనైనా యీ వ్యవహారం ఫలిస్తుందని—

దాసు:—(చప్పరించి) ఏమో—నాకేం ఆశ లేదు

మధు:—ఆమె నిజంగానే నిరాకరిస్తే నాకిక బతుకుమీద ఆశలుండవు...

దాసు:—ఓ ! అట్లా తేల్చుకో...కావాలంటే ఇప్పుడే ఇస్తాను సైనైడ్ ! కాని మా అందరి క్షేమం ఆలోచించి ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఒక ఉత్తరం జేబులో ఉంచుకో—

మధు:—(అటూ ఇటూ చూచి) దాసూ !చూడు... అదుగో !

దాసు:—ఘోరా—చీరెకొంగు కనిపిస్తే కల్యాణీదేవి అని పొరబడుతున్నావ్.

మధు—ఇందాకటి అమ్మాయ్—

దాసు:—ఐతే ఆమె మళ్ళీ వొస్తోందన్నమాట ?

మధు:—ఆమె వెనుక కల్యాణీదేవీను...చూడు ?

దాసు:—(చూసి) ఔనురా అబ్బీ : ఇదేదో నీకు సాను కూలంగానే వుండేట్లుంది.

మధు:—(మీసం మెలేసి) ఇందాకటినుంచీ నా రూపు రేఖావిలాసాలమీద నిశితవిమర్శ సాగించావ్‌గా?

దాసు:—తొందరపడొద్దోయ్! ఇల్లలగ్గానే పండుగైందా? ముందు జరగాల్సిన తంతుచూడు.

మధు:—అంతా నీదే భారం...నాకు భయంవేస్తోంది. ఏం మాట్లాడపోయి ఏం మాట్లాడుతానో?

దాసు:—ఐతే అసలు మాట్లాడవోక.

మధు:—నయం! మూగవాణ్ణనుకుంటుంది!

దాసు:—(మధువీపు తట్టి) మరేంభయంలేదురా బాబూ! తొందరపడవోక...ముందు ఆ స్వాప్నిక జగత్తునుంచి, భూలోకానికి దిగిరా.

[పద్మ ముందుగా వొచ్చింది...ఆమె వెనకనే కల్యాణి...కల్యాణిని సిగ్గు పూర్తిగా ఆక్రమించింది. ఆమె అడుగులు తడబడుతూన్నవి...పద్మ కల్యాణి చేతిని పట్టుకొని, దాదాపు బలవంతంగా లాక్కొచ్చింది]

పద్మ:—(నమస్కరించి) శ్రీ మధుకుమార్ అనుకుంటాను—

మధు:—(నమస్కరించి) ఔను.

పద్మ:—ఈమె కుమారి కల్యాణీదేవి!

[తన వెనక తలవొంచుకొని నిలబడివున్న కల్యాణిని ముందుకు లాగుతుంది...నిశ్చలంగావున్న కల్యాణిలో కదలికకోసం ఆమె వీపుమీద గిల్లుతుంది. కల్యాణి తేరుకొని, మధుకుమార్‌కు నమస్కరిస్తుంది; మధు ప్రతినమస్కారంచేస్తాడు: ఇద్దరూ ఒకర్నొకరు క్రీగంట చూసుకుంటారు]

మధు:—మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషం...వీరు దాసుగారు, బి. ఎ. బి, ఎల్., ప్రస్తుతం నాకు ఆంతరంగిక కార్యదర్శిగా ఉంటున్నారు.

[ఈవిధంగా తనను పరిచయంచేసినందుకు దాసు మధు కాలు తొక్కు-తాడు. మధు తన కాలు మరి అందకుండా, అవతలికి లాక్కుంటాడు. ఇంక చేసేది లేక, దాసు కల్యాణికీ, పద్మకూ నమస్కరిస్తాడు... వారిద్దరూ ప్రతినమస్కారం చేస్తారు... పద్మ మళ్ళీ కల్యాణి వీపుమీద గిల్లి ఆమె కర్తవ్యాన్ని గుర్తుచేస్తుంది]

కల్యా:—(తడబడుతూ) ఇంతవరకూ...యీామెను... పరిచయం చేయనందుకు క్షమించండి...యీామె మిస్ పద్మావతీదేవి...నా క్లాస్ మేట్...ప్రస్తుతం నాకు ఆంత రంగిక కార్యదర్శినిగా ఉంటున్నారు...

[ఈ విధంగా తనను పరిచయంచేసినందుకు పద్మ కళ్ళు పెద్దవిచేసి, కల్యాణి కాలు తొక్కుతుంది. కల్యాణి కాలు అవతలికి లాక్కోవటం తోనే, మరి చేసేదిలేక దాసుకూ, మధుకూ నమస్కరించి ప్రతినమస్కా-రాలను స్వీకరిస్తుంది]

మధు:—కూర్చోండి...పాపం...నిలబడేవున్నారు.

[పాలరాతి తిన్నెమీది దుమ్ము దులుపుతాడు. కల్యాణీ, పద్మ ఒకరి మొహం ఒకరు చూసుకొని, కూర్చోవటమూ మానటమూ తేల్చుకోలేక పోతారు]

దాసు:—సందేహించకండి...లేడీస్ ఫస్ట్ అన్నారు... కూర్చోండమ్మా—కూర్చోండి.

[పద్మా, కల్యాణీ కూర్చున్నారు. మధు మాట్లాడాలని ప్రయత్నిస్తాడు; ఏం మాట్లాడాలో తెలియక బుర్రగోక్కుంటాడు. తరువాత—]

మధు:—మీా పరీక్షలు ఎప్పుడండీ ?

[కల్యాణి 'జవాబు చెప్పు' అన్నట్లు పద్మవైపు చూస్తుంది. 'నేనుకాదు-నీవే చెప్పు' అన్నట్లు పద్మ కల్యాణివైపు చూస్తుంది...ఎవరు జవాబు చెప్పాలో తెగక ఇద్దరూ మౌనం వహిస్తారు]

దాసు:—మీా పరీక్షలు ఎప్పుడని మధుకుమార్ అడుగుతున్నారు.

కల్యా:—(హాస్యాస్పదంగావున్న తన స్థితిని గ్రహించి) ఏప్రిల్‌లోనండీ...ఇంకా రెండు నెలలకు...

మధు:—సెలవల్లో మీా ఊరు వెళ్తారా?

కల్యా:—ఊహుఁ. ఇక్కడేవుంటాను—

మధు:—హాస్టల్‌లోనా?

కల్యా:—హాస్టల్ కూడా మూసేస్తారు...మా పద్మావతి గారి ఇంట్లో ఉంటాను...

[సంభాషణ మధు, కల్యాణి మధ్యనే సాగటంచూసి, పద్మ, దాసూ ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటారు. తాము అక్కడ ఉండటం అనవసరమని అభిప్రాయపడి, ఎలాగైనా ఇక్కణ్ణుంచి వెళ్లిపోవాలనే ఎత్తు వేస్తారు]

దాసు:—(పద్మతో) చూడండి ... ఆ మూల ... ఆ ఫౌంటెన్ దగ్గిర ఎంతబాగుందో!

పద్మ:—ఔను...చాలాబాగుంది.

దాసు:—అక్కడికి వెళ్ళొద్దాం రండి—

పద్మ:—పదండి—

[పద్మ కల్యాణివైపు చూస్తుంది. కల్యాణి 'ఒద్దు' అన్నట్లు సైగ చేస్తుంది. పద్మ 'ఫర్వాలేదు' అన్నట్లు సైగచేసి, కల్యాణి జవాబుకుకూడా ఎదురుచూడకుండా, దాసుతో కలిసి వెళ్ళిపోతుంది]

మధు:—నేనెప్పుడూ పార్క్‌కు రాలేదు...పార్క్ ఇంత ఆనందంగా వుంటుందని ఎన్నడూ అనుకోలేదు.

కల్యా:—ఇంతకుముందు మీకు పార్కులో బాగుండ కేనా అటు ఇటూ తిరుగుతున్నారు ?

మధు:—ఔను...ఆ ఆనందం పార్కులో లేదను కుంటాను.

కల్యా:—మరి ?

మధు:—మీరు వనదేవతల్లే ఇక్కడికి రావటంతోనే పార్కులోకి కొత్త అందం వొచ్చింది.

[కల్యాణి సిగ్గుపడుతుంది]

కల్యా:—మీరు అతిశయోక్తులు వాడుతున్నారు.

మధు:—నేను అనుకున్నది పైకి చెప్పలేకపోతున్నాననే మాట మీరు గ్రహించినట్లున్నారు.

కల్యా:—చెప్పదలుచుకున్నదానికన్న అధికంగా చెపు తున్నారనుకుంటాను.

మధు:—కాదు. చెప్పదలచుకున్నదాంట్లో పదోవొంతు కూడా చెప్పలేకపోతున్నాను......చూడండి...నేను చిత్ర కారుణ్ణికాని, కవిని కాదుగా !

కల్యా:—మీ చిత్రాలంటే నాకు ఎంతో ఇష్టం !

మధు:—(ఉబ్బి) అలాగా ? నన్ను మీరు చూడక పూర్వమే, చిత్రాలద్వారా నేను మీకు తెలుసునన్న మాట ?

కల్యా:—తెలుసు...

మధు:—మీలాంటి దేవకన్యలు నా చిత్రాల్ని మెచ్చు కుంటారని నేను కలలోకూడా అనుకోలేదు. మీరెప్పుడూ ఒక్క ఉత్తరమన్నా రాసి, నాకు ఆ సంగతి తెలియపరిచారు కాదేం ?

కల్యా:—ఏమో ! మీలాంటి గొప్ప చిత్రకారులు, నా బోటి సామాన్యురాలి అభిప్రాయాన్ని లెక్కచేస్తారని ఎన్నడూ అనుకోలేదు.

మధు:—చిత్రకారుడంటే ఆకాశంలో ఉంటాడని పొర పడ్డారు కాబోలు !... నేనూ అలాగే పొరబడ్డాను.

కల్యా:—ఎట్లా ?

మధు:—దేవకన్యలు నందనవనంలో తప్ప భూలోకం లోని వనవిహారాల్లో కనిపించరనుకునేవాణ్ణి...ఏమైనా మనం మానవులమే ఐనందుకూ, ఒకళ్ళనొకళ్ళం గుర్తించినందుకూ నాకు చాలా ఆనందంగా వుంది—

[కల్యాణి పద్మ వెళ్ళినవైపు తేరి పారచూస్తుంది]

కల్యా:—పద్మా, వాళ్ళు ఎంతదూరం వెళ్ళారో ? ఇంకా తిరిగి రాలేదు.

మధు:—వొస్తారెండి...తొందరేం ?

కల్యా:—ఇక్కడ మీతో మాట్లాడుతూ కూర్చుంటే ఎవరైనా చూస్తే ఎంత ప్రమాదం ?

మధు:—ఎవరు చూస్తారు ? చూస్తేమాత్రం ప్రమాద మేముందీ ? మనమేమన్నా నేరం చేస్తున్నామా భయపడేం దుకు ?

కల్యా:—అది కాదు... మా ...హాస్టల్ రూల్స్ మీకు తెలియవు. ఆరున్నరకల్లా హాస్టల్‌లో ఉండాలి. అప్పుడప్పుడు మా మాట్రిన్ యీ పార్కుకు వొస్తూంటుంది కూడాను. నేనిలా పరాయి పురుషునితో మాట్లాడటం చూస్తే నా స్కాలర్‌షిప్ పోతుంది—

మధు:—(ఆశ్చర్యంగా) ఏమిటీ ? మీరు స్కాలర్‌షిప్ మీద చదువుకుంటున్నారా ?

కల్యా:—మరి నాలాటి బీదదానికి చదువుకుందుకు డబ్బెక్కడిది ?...క్షమించండి—నేను వెళ్తాను...

మధు:—వాళ్ళను రానీండి వెళ్దురు కాని...మీకు చాలా శ్రమకలిగించాను; అన్యథా భావించకండి.

కల్యా:—శ్రమ ఏముంది లెండి—మీలాంటి ప్రసిద్ధ చిత్రకారుల పరిచయం కలగటం నిజంగా ఎంతో అదృష్టం...

మధు:—ఇక్కడ మనం కాస్త తీరిగ్గా మాట్లాడుకునే అవకాశంకూడా లేనందుకు ఎంతో విచారిస్తున్నాను. నాదొక మనవి—

కల్యా:—చెప్పండి.

మధు:—ఎల్లుండి ఆదివారంమీకు సెలవేకదా ? మా స్టుడియోకు రాకూడదూ ?

కల్యా:—పగలైతే ఫర్వాలేదు—

మధు:—మరో మనవి—మీరు ఉదయం పదింటికే వొచ్చారంటే అక్కడే భోజనం చేద్దురుగాని—

కల్యా:—ఇప్పుడు అవన్నీ ఎందుకులెండి...

మధు:—కాదు-మా ఇంట్లో తప్పక భోజనం చేయాల్సిందే—

కల్యా:—సరే లెండి.

మధు:—ఇంకో కోరిక-

కల్యా:—చెప్పండి.

మధు:—మీ బొమ్మను చిత్రించి పై నెలలో చిత్రాల పోటీకి పంపుకునేందుకు అనుమతి—

కల్యా:—నా బొమ్మ గీస్తే మీకు బహుమతి వొస్తుందనే నమ్మకం నాకు లేదు.

మధు:—నాకు వుందిగా !

కల్యా:—ఐతే మీ పనితనంమీది నమ్మకమే ఐవుండాలి.

మధు:—కాదు...ఏదైనా ప్రకృతిలో లేనిదాన్ని ఏ ఆధారమూ లేకుండా సృష్టించటం ఎవరివల్లా కాదు......నా నమ్మకం ఏమంటే నా కళలోని లోపాల్ని, మీలాంటి మోడల్ సరిచెయ్యగలదని ! కనుక నా యీ కోరికను మీరు మన్నించండి...

కల్యా:—మీ రేదో దేవతను వరాలడిగిన ధోరణిలో మాట్లాడుతున్నారు !

మధు:—ఔను. నేనూ అలాగే అనుకుంటున్నాను...ఇలవేల్పు ప్రత్యక్షమైనప్పుడు కోరికలన్నీ ఒక్కసారిగా గుర్తురావు.

కల్యా:—మీరు నన్ను ఆకాశానికి ఎత్తుతున్నారు. అందువల్ల నేను మీకు యెంత దూరమౌతానో ఆలోచించటం లేదల్లేవుంది.

మధు:—నాకు అందకుండా పోతారనే భావం నాకు లేదు...నిజానికి నాకు అందటమంటేనే మీ విలువ తగ్గటమేమోననే అనుమానంకూడా నన్ను వేధిస్తోంది...అదంతా అలా వుంచండి...ఆదివారం ఉదయం మీకోసం ఎదురు చూస్తూవుంటాను.

కల్యా:—సరే లెండి—

[దాసూ, పద్మా వొచ్చారు]

కల్యా:—పద్మా! చాలా ఆలస్యమైంది—వెళ్దామా?

మధు:—పద్మావతీ దేవిగారూ! ఎల్లుండి ఆదివారం ఉదయం, తాముకూడా కల్యాణీదేవిగారితో మా ఇంటికి విందుకు రావాలని కోరుతున్నాను.

పద్మ:—నాకు వీలవదండీ...ఐనా ప్రయత్నిస్తాను—

మధు:—మీరు రాకపోతే కల్యాణీదేవిగారు రారట—

దాసు:—నేనూ రాను—

మధు:—చూశారా! మీరు రాకుంటే ఇద్దరు మానుకుంటారు.

పద్మ:—స రే లెండి—

కల్యా:—పద్మా! చాలా ఆలస్యమైంది—

పద్మ:—ఒస్తామండీ-

[కల్యాణీ, పద్మా నమస్కరించి వెళ్తారు]

దాసు:—అప్పుడే వీందుదాకా లాక్కొచ్చావే? పెళ్ళి మాటలేమన్నా జరిపావా?

మధు:—ఆమెను చూస్తేనే నాకు భయంవేసిందంటే నమ్మ...ఏదో లోకాభిరామాయణం మాట్లాడాం...అంతే త్వరపడితే అసలుకే మోసం వొస్తుందేమోనని ఊరు కున్నా...

దాసు:—త్వరపడకపోయినా ప్రమాదమేరా అబ్బీ!

మధు:—ఏమో-ఆమె నా చిత్రకళను ఎంతో మెచ్చు కుంది. నాకో పెద్ద అనుమానం కలిగింది; చిత్రకళను మెచ్చు కున్నంతమాత్రాన, నేను నచ్చానని ఏమిటి? తొందర పడితే "కళాకారుడివైనందుకు మర్యాద ఇస్తే ఇదేమి టయ్యా!"అంటుందేమో నని భయపడ్డాను. అదీగాక ఆ వ్యవహారం నిదానంగా చూసుకోవొచ్చులే...ఎల్లుండి వొస్తా రుగా...అంతరంగిక కార్యదర్శీ!

దాసు:—నేను నీకు అంతరంగిక కార్యదర్శినట్రా?

మధు:—కాక? ంనా కార్యభారమంతా నీవయ్యాక కార్యదర్శివి కాక మరేమిటి? నాకు కార్యదర్శివంటే నీకెంత గౌరవమో ఆలోచించు...

దాసు:—అసలు నీకు మర్యాదంటూ వుంటేకదా—నీ ద్వారా నాకు రావటం? కల్యాణీదేవిదగ్గర నేను నీకు కార్యదర్శిగావున్నా ఫర్వాలేదుకాని, వూరంతా యీ సంగతి టముటమూ వేశావంటే—నీ అప్పులవాళ్ళంతా నామీద పడతారు...

మధు:—భయంలేదు...యీ అప్పులన్నీ తీరుస్తాను—అది సరేకాని, పద్మావతీ దేవితో మనసంగతి ఏమన్నా హెచ్చరించావా?

దాసు:—కల్యాణీదేవి సంగతి కనుక్కున్నాను. ఆమె పైకి కనిపించేటంత మెతకకాదట; మహా తలబిరుసట కొంచెం వేళాకోళం చేసిన ఒకళ్ళిద్దరు విద్యార్థులు వేడినీళ్ళు కాపు కాచుకోవాల్సి వొచ్చిందట. మరొకడు కాలేజినుంచి వెళ్ళగొట్టబడ్డాడటకూడాను. కనుక ఆమెతో జాగ్రత్తరోయ్—

మధు:—కాని మన విషయంలో చాలా దయగా వుందిలే!

దాసు:—అలా అని తొందరపడకు...మొదట్లో స్త్రీ పురుషుడంటే ఎంతో దయగా వున్నట్లే ప్రవర్తించి, ఆకర్షించుకుంటుంది. అందులోనూ ఆమె సౌందర్యవతి ఐతే ఇక చెప్పనక్కర్లేదు. తన సౌందర్యాన్ని రికగ్నైజ్ చేయించుకోవటం, కొంతమంది సౌందర్యారాధకుల్ని ఏర్పరచుకోవటం సహజం...కాని యీ ఆరాధకుడికి లొంగటం ఏదో యోగం అనుకో—

మధు:—ఆమెకోసం యాగమైనా, త్యాగమైనా మరేం ఫర్వాలేదు. అందుకామె తగు—

దాసు:—అది సరేనోయ్—చివరకు ఇదంతా వృథా ఔతుందేమో...

మధు:—ముందుగానే అక్షింతలు వేయవోక...సరేకాని నీవు శనివారమే రావాలోయ్.

దాసు:—విందు ఆదివారంగా!

మధు:—ఔననుకో...కాస్త ఇల్లూ అది కడగటం, కొబ్బరాకు తోరణాలూ. రంగుకాగితాలూ అంటించటం, ఇలాటి చిల్లరపనులు లేవటోయ్ ?

దాసు:—ఇదా కార్యదర్శి పని ?

మధు:—నా గొప్పతనాన్ని బట్టే, నీ గొప్పతనమూను. అందుకని, నీ గొప్ప చూపాలంటే, ముందు నన్ను గొప్ప వాణ్ణి చేయకతప్పదుగా!

దాసు:—ఏం గొప్పోయ్ ? చేతులో దమ్మిడీకూడా లేకుండా యీ విందొకటి పెట్టావ్ ?

మధు:—చూడు... తెల్లారేప్పటికి ఆ రావుబహద్దూర్ తాలూకు చిత్రాలు గీసేసి పైకం తెస్తాను...

దాసు: —ఈ విధంగానన్నా రావుబహద్దూర్ చిత్రాలు పూర్తవుతున్నందుకు సంతోషం...

మధు:—సరే—వెళ్దాం పా.

[దాసూ, మధూ వెళ్ళిపొయ్యారు; క్షణం నిశ్శబ్దం.
కల్యాణీ, పద్మా వొచ్చారు]

పద్మ:—వాళ్ళు వెళ్ళనేవెళ్ళారు...ఐనా వాళ్ళు విందుకు పిలవగానే నీ వెందుకు అంగీకరించావంట? కాస్త బెట్టు చూపమని చెప్పలా? నీకు తీరదంటే పోలా?

కల్యా:—అన్నానే! కాని ఆయన ప్రార్థనాపూర్వకంగా అడిగేప్పటికి కాదనలేకపొయ్యా—

పద్మ:—నేను అనుకుంటూనేవున్నా: ఈ పిచ్చిమొద్దు ప్రణయసాగరంలో తలక్రిందులుగా పడిపోతుందని. అనుకున్నంతా ఐంది. రమ్మంటే వొస్తూ, పొమ్మంటే పొయ్యే వాళ్ళమీద ఏంవిలువ వుంటుందంట?

కల్యా:—ఏం దేమో ఐందిలే!

పద్మ:—పోనీ ఒకపని చేద్దాం. కారణాంతరాల వల్ల ఎల్లుండి రాలేమని ఒక ఉత్తరం రాద్దాం.

కల్యా:—అదేం బాగుంటుం దే—పెద్దమనుషులకు మాట యిచ్చాక?

పద్మ:—ఏం పెద్దమనుషులే!......అందులోనూ నేను ఆయన కార్యదర్శితో మధుకుమార్ విషయం మాట్లాడాగా?

కల్యా:—(ఆతృతతో) ఆఁ. చెప్పు...ఏమన్నా రాయన?

పద్మ:—మధుకుమార్ పైకి కనిపించేటంత మెతకమనిషి కాదట. లోగడ యెంతోమంది అందగత్తెలు, వివాహార్థం

ఆయన వెంట బడ్డారట; వాళ్ళల్లో లక్షాధికార్ల కుమార్తెలు కూడా వున్నారట...వాళ్ళంతా ఎంత ప్రయత్నించినా ఒక్కళ్ళకూ ఆయన లొంగ లేదట—శృంగభంగంతో వాళ్ళంతా నిరాశ చేసుకున్నారట! అలాటి కఠినహృదయుణ్ణి, స్త్రీ ద్వేషిని ఆకర్షించిన కల్యాణీదేవి అప్సరసనే నమ్మకం, ఆయనకు కలిగిందట!

కల్యా:—అట్లాగా ? అలాటి మొగాణ్ణి లొంగదీసుకుంటేనే...

పద్మ:—తొందరపడి శపథం చెయ్యకే. కాస్తైనా బెట్టులేకుండా వ్యవహారాన్ని దొళ్ళనిస్తున్నావని గుర్తుంచుకో-

కల్యా:—సరేకాని, ఆయన నన్ను గూర్చి అడగలా ?

పద్మ:—ఆయన అడగాలాయేం ? నేనే చెప్పాను. నీ బెట్టూ, నీ గర్వం, నీవుచేసిన శృంగభంగాలూ అవీ నసాళానికి అంటేట్లుగా, నవరసభరితంగా చెప్పాను. అదొక్కటే నాకు ఆశ. నీవు కాస్త సందిచ్చినా, ఆ ఆంతరంగిక కార్యదర్శి నా మాటల్ని మధుకుమార్‌కు అప్పగిస్తాడనీ, అందువల్ల ఆయన వొళ్ళు దగ్గర పెట్టుకొనే సంచరిస్తాడనీ...

కల్యా:—ఆయన నీవనుకున్నంత తక్కువరకం అభిరుచులు గలవాడు కాదులేవే! చాలా మర్యాద తెలిసిన వాడు...

పద్మ:—యీ కబుర్లు కట్టిపెట్టు. మొదట్లో ప్రియురాలి ముందు మోకరించటం యీ పురుషజాతికి బాగా తెలుసు.

లొంగక ముందుండే గౌరవం, లొంగాక పోతుంది.

కల్యా:—నీకెందుకు, నేను జాగ్రత్తగా వుంటాగా! నీలాంటి ఆంతరంగిక కార్యదర్శిని ఉండగా యీ సమావేశాలు విజయవంతంగానే ఉంటయ్ —

పద్మ:—భలే ఉద్యోగం దొరికిందిరా బాబూ!

కల్యా:—బ్రహ్మం వాళ్ళా వొచ్చివుంటా రేమో—పోదాం పా—

పద్మ:—ఔనేవ్! ఆ సంగతే మరిచిపోయ్యాను. ఆదివారంనాడు బ్రహ్మన్ని వొదిలించుకోవటం ఎలగంట?

కల్యా:—నీవు మా ఇంటికిరా... పేరంటా కి పిలు...

పద్మ:—వొస్తానంటాడేమో?

కల్యా:—చీరా, జాకెట్టూకట్టి వెంటపెట్టుకొని వెళ్ళు. పెద్ద ముద్దయిదువల్లే బాగానే ఉంటాడు లే—

[ఇద్దరూ నవ్వుకుంటూ వెళ్తూండగా తె]

## VII

[పార్కు గేటుదగ్గిర—నిర్మలా, సత్యవతీ ప చ్చారు]

నిర్మ:—బ్రహ్మం ఏడే?

సత్యా:—వొస్తున్నాడు; దొర్లుకుంటూ రావొద్దూ?

[బ్రహ్మం వొచ్చాడు. పాతికేళ్ళు ఉంటయ్. తెల్లని లాగూ, పులి మచ్చల బుష్‌కోటూను. గుండ్రని ముఖం; హేంజర్ లైట్లను జ్ఞాపకంచేసే కళ్ళు. శరీరనిర్మాణంలో ఎక్కడా సమపాళ్ళు కనిపించవు. రుబ్బుడు పాత్రమల్లే, భారమైన శరీరాన్ని లాక్కుంటూ నడుస్తాడు. చూడగానే మూర్ఖుడని తెలుస్తుంది. నిర్మలా, సత్యవతీ బ్రహ్మం అవస్థచూసి నవ్వుతున్నారు]

బ్రహ్మం:—అట్లా ఎగతాళి చేయవోకండి. స్నేహితుడికి సహాయం చేస్తే ఎంతపుణ్యమో తెలుసా ?

నిర్మ:—చెప్పు...నిజంగానే మేమిద్దరమూ చేతనైన సహాయం చేస్తాం.

[జ్యోతిష్కుడు వొచ్చాడు]

సత్య:—సమయానికి జ్యోతిష్కుడుకూడా రానేవొచ్చాడు. చెయ్యిచూపించుకో. సగం వ్యవహారం ఇక్కడే తేలిపోతుంది—

[బ్రహ్మం చెయ్యచాపుతాడు, జ్యోతిష్కుడు పరిశీలించిచూస్తాడు]

జ్యోతి:—మీాకు భూతకాలంలోని విషయాలు కావాలా? వర్తమానంలోవా ? లేక భవిష్యత్ లోవా ?

సత్య:—భూతకాలంలోవి బహుశా వినదగ్గ విషయాలేవీ ఉండవు...వర్తమానంలో బ్రహ్మంగారు ఎలా వున్నారో తెలుస్తూనేవుంది...కనుక భవిష్యత్ తెలుసుకుంటే, తగిన జాగర్తలు పడటం...అంటే, అవసరమైతే దుష్టగ్రహాల పీడను వొదిలించుకునేందుకు తాయిత్తులూ వగైరా కట్టించుకోవటంలాటివి చేస్తాడు...

జ్యోతి:—ఐతే వినండి. ఇప్పుడు మీారు ఘోరమైన ప్రణయ సమస్యలో ఇరుక్కున్నారు—

[బ్రహ్మం ముఖం వికసించింది; ఆశతో సత్యవతివైపూ, నిర్మలవైపూ చూశాడు]

నిర్మ:—ఆ ప్రణయం ఏరూపం దాల్చబోతోందో త్వరగా చెప్పు—

జ్యోతి:—యీ రేఖ చూశారూ...ఇది కల్యాణ రేఖ... అంటే ఒక సంవత్సరం లోపుగానే వివాహం తప్పదు...

సత్య:—ఐతే ఇంకా సంవత్సరానిక్కాని బ్రహ్మం పిచ్చి కుదరదన్నమాట ?

బ్రహ్మం:—(సత్యవతిమాట వినిపించుకోకుండా, నిర్మలతో రహస్యంగా) నిర్మలా ! నాపెళ్ళి కల్యాణితో ఔతుందనేనా?

నిర్మ:—ఆఁ. లేకుంటే పెళ్ళి చేసుకోనని శపథం చేశావ్‌గా ? కనుక కల్యాణితోనే ఐతీరాలి.

బ్రహ్మం:—డబ్బుసంగతికూడా అడుగు—

జ్యోతి:—కల్యాణంతోపాటే బోలెడు ఆస్థి—

బ్రహ్మం:—(నిర్మలతో రహస్యంగా) కల్యాణితో పెళ్ళి ఐతేనేగా యీ డబ్బు ? కనుక నా పెళ్ళికీ డబ్బుకూవున్న లంకెను నా చేతిలోని రేఖల్ని చూసి జ్యోతిష్కుడు సరిగ్గా కనిపెట్టాడు. ఔనా ?

నిర్మ:—ఇంకా సందేహమా ? అసలు నీపెళ్ళి కల్యాణి తోనే ఐతీరుతుందని నా నమ్మకం. జ్యోతిషంకూడా అలాగే వుందాయె !

[బ్రహ్మం విప్పారిన ముఖంతో జ్యోతిష్కుడికి ఒక అర్ధరూపాయి ఇస్తాడు. చాలదన్నట్లుగా జ్యోతిష్కుడు కదలడు]

బ్రహ్మం:—ఆ డబ్బురానీ...అప్పుడు బాగా ఇస్తాను. ఇప్పటికి ఇంతే—వెళ్ళు...

[జ్యోతిష్కుడు కదలడు]

నిర్మ:—అయ్యగారూ చెప్పటంలా ? వేధించకపో... ఆయన పెళ్ళి ఎంత వైభవంగా జరుగుతుందో తెలుసా ? అప్పుడు నీకు కొత్తబట్టలూ, అవీ ఇవీ...

[జ్యోతిష్కుడు నిరాశచేసుకొని, పెదవివిరిచి వెళ్ళిపోతాడు.]

బ్రహ్మం:—సత్యవతీ ! జ్యోతిషం నిజమేనంటావా ?

సత్య:—ఓ ! మనకు ప్రత్యక్షంగా కనిపిస్తూంటే; సందేహించాల్సిన పనేమున్నదంట ?

బ్రహ్మం:—నాకు బాగా నమ్మకమే లే...నీ అభిప్రాయం కూడా తెలుసుకుందామని అడిగాను.

సత్య:—సరేకాని, కల్యాణివిషయంలో నీవు తొందర పడకపోతే లాభంలేదు.

బ్రహ్మం:—(నిట్టూర్చి) ఏం తొందరో ? నన్నుచూస్తేనే చిచ్చుబుడ్లల్లే నిప్పులు కక్కుతుంది. ఆమెకు సంగీతమంటే ఇష్టంకదానని, రాత్రిళ్ళు నాగదిలోనుంచి సినీమాపాటలు పాడుతూంటే, 'బుద్ధిలేదా ?' అని అడిగింది.

సత్య:—'బుద్ధివుంటే పాడేవాణ్ణా ?' అనకపోయ్యావా ?

బ్రహ్మం:—ఆమాత్రం ఆమెకు తెలియదాయేం ? (సత్యవతి మాటకు అర్థం ఇప్పుడే తెలుసుకున్నట్లుగా గాభరాపడి) చూశావా ! నన్నెట్లా ఆటపట్టించిందో—

సత్య:—తమహాపాకప అన్నా: స్నేహితంలో కొ_స్తన్నా ఓర్పులేకుంటే ఎలా ?

నిర్మ:—నా మాటవిని కవిత్వంరాసి కల్యాణికి అంకితం ఇవ్వు.

బ్రహ్మాం:—అదీ మూశాగా ! ఏమిటీ పైత్యం అని...

సత్య:—చెంప వాయగొట్టలేమకదా ?

బ్రహ్మాం:—నేనంత తెలివితక్కువ వాణ్ణాయేం ? పరుగెత్తలేక, మెట్లమీాటనుంచి సుఖంగా దొర్లుకుంటూ వెళ్ళి, తప్పించుకున్నా—

నిర్మ:—బ్రహ్మాం పైకి అలా వుంటాడుకాని, చాలా తెలివిగలవాడే! గాజుల గల గల వినిపించగానే మహా మెలకువతో వుంటాడు. శరీరాన్ని ఎంత జాగ_ర్తగా కాపాడు కుంటాడో తెలుసా ?

బ్రహ్మాం:—ఆరోగ్యం విషయంలో ఎంత జాగ_ర్త తీసుకున్నా రా_త్రిళ్ళు ఆ కడుపులో నెప్పి రానేవొ_స్తోంది నిర్మలా?

సత్య:—అందుకనే పాట బాగా కుదిరివుండదు...

నిర్మ:—మాంఛిమందు చెప్తాను తీసుకో.

బ్రహ్మాం:—చెప్పు రాసుకుంటాను.

నిర్మ:—'లోధ్ర' అనే మందుతాగు—

[బ్రహ్మాం రాసుకుంటాడు. సత్యవతి పగలబడి నవ్వబోతోంది. నిర్మల ఆమెను గిల్లి ఊరిమిచూస్తుంది]

బ్రహ్మాం:—ఇది మంచిమందా ?

సత్యః—దివ్యమైన మందు...ప్రకటనలు చూడలా— సకల గర్భాశయ రోగములకూ దివ్యౌషధమని ?

బ్రహ్మం:—యీ మందుతో కడుపులో నెప్పి పోదు త్తే, కల్యాణి విషయంలో రెండింతలుగా పని చేయదలుచుకున్నాను.

నిర్మః—మధ్యాహ్నం ఏవో కాగితాలు చదువుకుంటూ కల్యాణి తనలో తానే కులుక్కుంటోంది...బహుశా అదంతా నీ ప్రణయ కవిత్వమనుకుంటాను—

బ్రహ్మం:—నిజంగా ?...ఔను నేనూ కనిపెట్టాను. ఇవ్వాళ కల్యాణి ఎంతో సంతోషంగా వుంది !

సత్య:—నామాటవిని, ఆమె సంతోషంగా వున్నప్పుడే తియ్యతియ్యని మాటలు చెప్పి వలలో వేసుకోవాలి.

నిర్మ:—స్త్రీ మనస్తత్వం బ్రహ్మానికి బొత్తిగా తెలియదు. ఒక సందర్భంలో నిరాకరించిన స్త్రీ, వేరొక సందర్భంలో తనంతతానై లొంగిపోతుంది. కనుక జాగర్తగా కనిపెట్టి ఉండాలి.

బ్రహ్మం:—అది నేను చూసుకుంటాను కాని-మీరిద్దరూ నాకు తప్పక సహాయం చేయాలి.

సత్య:—నీ చెంపలువాస్తే, వేడినీళ్ళకాపు వేయమం టావా ? అందుకు సిద్ధం—

బ్రహ్మం:—చూశావా ! మీకు ఎప్పుడూ వేళాకోళాలే!

నిర్మః—లేదులే ! తమాషాకు సత్యావతి అలా అంటూ వుంటుందిలే ! ఎలాగైనా బావవరసకదూ ?

[బ్రహ్మం బుజాలు ఎగరేస్తాడు]

సత్య:—నామాటవిని కల్యాణి మనస్సు నీమీద లగ్నం కావాలంటే నీతాలూకు చిన్న ఫోటోను ఆమె గదిలో ఉంచు—

బ్రహ్మం:—చిన్న ఫోటోలో ఇంత పెద్ద శరీరం పడుతుందా?

నిర్మ:—నిజమే! పెద్దఫోటోయే తీయించు—

బ్రహ్మం:—అదేవిధంగా ఆమె ఫోటోను నాగదిలో కూడా ఉంచమంటావా?

సత్య:—తప్పకుండా! ఉదయం లేవగానే ఆమె ఫోటోకు పూలమాల వేయటం, కాస్త ధూపదీప నైవేద్యాలివ్వటం చేస్తూంటే—నీవు ఎంతగా ఆమెను ప్రేమిస్తున్నావో తెలిసి పోతుంది.

బ్రహ్మం:—నిజమే—నేనాపని చేస్తాను కాని, మీరుకూడా సమయం చూసి, నాలుగు మంచిమాటలు కల్యాణి చెవిలో వేస్తుంటేచాలు.

సత్య:—ఆమాటకొస్తే నిన్నుగూర్చి నేను దండకమే చదువుతా తెలుసా?

నిర్మ:—నీ నవమోహన రూపాన్ని వర్ణిస్తా తెలుసా?

సత్య:—కాని ఆమె వినకుంటే ఏంచెయ్యాం!

బ్రహ్మం:—ఎందుకు వినదూ? మీ మాటంటే ఆమెకు మహా గురి!

నిర్మ:—నాకు తెలియక అడుగుతాను...కల్యాణికి ఆమె తండ్రిచేత రికమండ్ చేయించకపొయ్యావా ?

బ్రహ్మాం:—అదీ ప్రయత్నించాను. కల్యాణి తల్లిలేని పిల్లకదూ—తండ్రికి ఎంతో గారాబం! ఆమె మాటను ఆయన కాదనలేడు. పెళ్ళివిషయంలో ఆయనేమీ కల్పించుకోడు. కల్యాణి ఒప్పుకుంటే పెళ్ళి చేసేస్తానంటాడు. నేను ఒప్పుకున్నా, ఆమె నన్ను ఒప్పుకోకపోతే నా తప్పేముంది?—స్వశక్తితోనే ఆమెను ఒప్పించాలి...మీరుకూడా—

నిర్మ:—మా ప్రయత్నలోపం ఉండదులే!

బ్రహ్మాం:—అలాఐతే యీ సంవత్సరంలోనే నేనొక ఇంటివాణ్ణి అవనూ ?

సత్య:—నీ పెళ్ళి చేయించటంలో మా శక్తివంచన ఉండదుగా !

బ్రహ్మాం:—ఏరీ వీళ్ళు ? (అటూ ఇటూ తేరిపారజూచి) ఎటువెళ్ళారు ? అటుపోయి వెదుకుదాం ?

సత్య:—ఒస్తార్లే...ఇప్పుడు వాళ్ళిక్కడ లేకపోవటం వల్ల మనం జాగ్రత్తగా ప్లాన్ వేసుకున్నాం. నీ వ్యాధికి దివ్యౌషధంకూడా దొరికింది.

[పద్మా, కల్యాణీ వొచ్చారు]

కల్యా:—వొచ్చి చాలా సేపైందా ?

సత్య:—ఇప్పుడేలే...బ్రహ్మాం జ్యోతిషంకూడా చెప్పించుకున్నాడు. బ్రహ్మాం పెళ్ళి యీ సంవత్సరంలోనే అవుతుందట !

[కల్యాణి నవ్వింది: బ్రహ్మాం సంతోషంతో భుజాలు ఎగరేశాడు]

బ్రహ్మాం:—(సత్యవతితో రహస్యంగా) నా పెళ్ళి కల్యాణి తోనే నని కూడా చెప్పు—

సత్యా:—(రహస్యంగా) ఇంతమందిలోనా ? ఒంటరిగా ఉన్నప్పుడు నీవే చెప్పు...

[బ్రహ్మాం సరేనన్నట్లు తలవూపాడు]

కల్యా:—ఇక వెళ్దాంపదండి...పొద్దుపోతోంది.

[కల్యాణి ముందుకు సాగుతుంది. బ్రహ్మాం ఆమె వెనకాలే ఎంతో అణుకువగా నడుస్తూంటాడు. నిర్మలా, సత్యవతీ పద్మను చుట్టుముట్టు తారు. రహస్యంగా ఏమేమో మాట్లాడుకుంటారు]

కల్యా:—ఏమిటా పెళ్ళినడకలు—రండి !

పద్మ:—దార్లో చెప్తాలే...పదండి...

[ముగ్గురూ కలిసి పోతూండగా తెర]

## VIII

[మధు స్టూడియో, మొదటిరంగంలోవలె ఘాళిధూసరితంగా లేక, చాలా శుభ్రంగా వుంది. స్టుడియోలోని కొద్ది ఫర్నిచరూ చాలా బాగా సర్దబడి ఉన్నది. ఫ్లవర్ వాజ్ లో ఉదయమే కోసిన గులాబీపూలు ఉన్నవి. బూజూ దుమ్మూ ఎక్కడా కనిపించవు. దూరాన పిట్టగోడదగ్గిర స్టాండు మీద గుడ్డ వేసివుంది.

మధు చాలా సంతోషంగా వున్నాడు. కాలుకాలిన పిల్లల్లే అటూ ఇటూ తిరుగుతూ వివిధ కోణాలనుంచి ఆ హాలు సౌందర్యాన్ని పరీక్షిస్తు న్నాడు. అప్పుడప్పుడు అక్కడి దిక్కడా, ఇక్కడి దక్కడా సర్దు తున్నాడు.

ఈ హడావిడిలో ఉండగా, మెట్లుమీద చప్పుడైంది. మధు ఆత్రుతతో చూసివొచ్చి, తాపీగా సోఫాలో కూలబడ్డాడు. దాసు మెల్లిగా వచ్చి కుర్చీలో కూర్చున్నాడు]

మధు:—వాళ్ళే మోననుకుని తొంగిచూశాను—

దాసు:—ప్రణయప్రైత్యం కాస్త విజృంభించింది...(తేరి పారజూచి) మహబాగా చేశావ్ రా అబ్బీ! అట్లా వాళ్ళొంది పని చెయ్యాలి.

మధు:—రాత్రంతా, కుర్రాడూ నేనూ సర్దలేక చచ్చాం. నీవు వొస్తావేమోనని చాలాసేపు ఎదురుచూశాను.

దాసు:—ఒచ్చానుగా—

మధు:—ఎందుకూ ? విందుభోజనానికి...నా ఆంతరంగిక కార్యదర్శివికదా—నాకు ఎంత చేదోడువాదోడుగా ఉండాలీ!

దాసు:—ఆనెఎదుట యీాజీతం బత్తెంలేని యీా బోడి ఉద్యోగానికి ఒప్పుకున్నానుకాని యీా గాడిదచాకిరీ చేతుటానికా నేను వొచ్చేది ? మనది యుగంధరబుర్రరా—

మధు:—సరేకాని, సర్దుడూ అదీ బాగుందో లేదో చూడు—

దాసు:—బాగానేఉందికాని, కాసిని మామిడాకు తోరణాలూ, రంగు కాగితాలూకూడా తగిలించక పొయ్యావా ? పెళ్ళివారు రాగానే పూలదండలు వేయాలోయ్...సిద్ధం చేశావామరి ?...అన్నట్లు మంగళవాద్యాలేవీ ? బ్యాండూ,

గీండూ వినిపిస్తుందేమోనని కింద కాస్సేపు నిలబడి మరీ వొచ్చాను.

మధు:—నీకంతా వేళాకోళంగా వుంది. ఇక్కడికే తడిసి మోపెడైంది—తెలుసా ?

దాసు:—అన్నట్లు డబ్బేలా సంపాయించావ్ ?

మధు:—అర్టోయ్ ! ఆ రావుబహద్దూర్ దంపతుల బొమ్మలు పూర్తిచేసి వాళ్ళమొహాన పారేసి పైకం తీసుకొచ్చాను.

దాసు:—బతికించావ్...నామాట దక్కించావ్.

మధు:—బకాయిపడ్డ జీతమంతా ఇచ్చి కుర్రాణ్ని మళ్ళీ పనిలోకి లాక్కొచ్చాను. ఇంకా ఇంటిఅద్దే, సిగరెట్ దుకాణంలోని బాకీలూ, పచారీకొట్టు షావుకారుకాతా—అవన్నీ అలాగేఉన్నయ్.

దాసు:—వాములుమేసే స్వాములవారికి, పచ్చగడ్డి ఫలహారమన్నట్లు నీకు ఎంతైనా చాలేట్లులేదు.

మధు:—ఉండవోయ్...ఇలాగే చూస్తూండు: అద్భుతాలు చేసేస్తాను. ఇప్పుడు జీవితంలోకి ఎంత వెలుగు వొచ్చిందో తెలుసా ? యీ ఉత్సాహంలో ఎంత పనైనా ఇట్టే చేస్తాను. అందులోనూ ఆమెకూడా బీదది. ఆర్థికంగా చాలా బాధపడుతూండి వుంటుంది. పాపం ఆమె స్కాలర్ షిప్‌మీద చదువుకుంటోందట. అందుకని వీలైతే కొంత ధనసహాయం చేద్దామనుకుంటున్నాను—

దాసు:—ఆపనిమాత్రం చెయ్యవోక. నిజానికి ఆమె ఎవరు? నీ వెవరు? ఆమెవల్ల నీకు ఇన్స్పిరేషన్ కలుగుతే కలుగుగాక !...కాని తీరా ఆమె నిన్ను నిరాకరిస్తే ఇదంతా నష్టమైపోతుంది.

మధు:—ఛా! అలా రూపాయి అణా పైసాల్లోకిమార్చి మాట్లాడుతావేం? ఐనా ఆమె నన్ను నిరాకరిస్తుందా? అలా ఎన్నటికీ జరగదు.

దాసు:—సరే చూస్తూవుండు. ఆడవాళ్ళ మనస్తత్వం నీకేం తెలుసు? అందులోనూ ఈ ఆధునిక యువతులున్నారే-వాళ్ళకు తమ సౌందర్యాన్ని ఆరాధించే యువకులు అవసరం. వాళ్ళుమాత్రం ఆరాధకుడికి ఒకపట్టాన లొంగరు; లొంగుతే ఆరాధన మరి-అనవసరం—ఎందుకంటే అనుభవమే మొదలౌతుందికనుక! అందుకని ఆ ఆకర్షణ తగ్గకుండా వాళ్ళు జాగ్రత్తపడతారు.

మధు:—సౌందర్యాన్ని ఆరాధించటంలో తప్పేముందీ?

దాసు:—ఏంలాభమోయ్? అంతకన్న కలలో కనిపించిన దేవకన్యను ఆరాధించుకోవటం నయం! ఎందుకంటే ఆమె స్వప్నసుందరి అని తెలిసే ఆరాధనను ఆరంభిస్తావ్... పోతే నిత్యజీవితంలో ఐతే ఏవో ఆశల్ని పెంచుకుంటూ పోవటంతో ఒకనాడు యీ నిరాశనంతట్నీ భరించాల్సి వుంటుంది.

మధు:—ఆధునిక యువతుల విషయంలో నీ అభిప్రాయం ఒకవేళ నిజమేఐనా, కల్యాణి అలాటి ఎండమావుమాత్రం కాదని నా గాఢనమ్మకం. ఐనా నేనూ తొందరపడతలచుకో లేదు. కొన్నాళ్ళపాటు స్నేహం చేస్తేనేకాని ఒకళ్ళనొకళ్ళు అర్థంచేసుకునే అవకాశం ఏర్పడదు.

దాసు:—నిన్ను గూర్చి ఆమె పూర్తిగా అర్థంచేసుకుంటే ఇంక నీకు దక్కినట్లే !

మధు:—అంటే నన్ను గూర్చి నేనేదో దాచిపెడతా ననా ? నా దుర్మార్గాల వేటనో ఆమెకు తెలియకుండా ఉంచుతాననా ? నే నామెకు తగినవాణ్ణి కాకుంటే కాకుంటు గాక—కాని ఆమె ఆరాధకుల్లో ఒకణ్ణన్యే అర్హతకూడా నాకు లేదంటావా ?

దాసు:—నా ఉద్దేశం అదికాదు. ఆమె బీదది. ప్రస్తుతం నీ ఆర్థికపరిస్థితులు బాగాలేవు. బీదతనంలోని బాధేమిటో ఆమెకు తెలుసు; నీకూ్కడా యీ వాటికి అర్థమై వుంటుంది. మరి ఆమె పెళ్ళాడాకన్నా బీదరికపు బాధలనుంచి ఏముక్తిని ఆశించదంటావా ?

మధు:—అదా ? చూడు. తగినంత సంపాయించేవరకూ ఆమెతో పెళ్ళి ప్రస్తావనే తేను...ఆమె జీవితాన్ని సౌఖ్య మయం చేసేందుకు రాత్రింబవళ్ళు కష్టపడతాను.

దాసు:—మంచిదే! జీవితాన్ని అలా యదార్థరూపంలో చూడు. ఆశయాలకూ, ప్రాక్టికల్ జీవితానికీ చాలాదూరం వుంటుంది.

మధు:—నాకు ఆ పిచ్చి పిచ్చి ఆశయాలు లేవు. ఆకాశంలో కలలుకనటం వృథా అని తెలుసుకున్నాను. భూమిమీద మనం నెరవేర్చుకోగలిగిన ఆశయాల్నే దృష్టిలో పెట్టుకుంటాను—సరేనా ?

దాసు:—కల్యాణీదేవివల్ల నీలో యీ మార్పు రావటం హర్షించదగిందే !

మధు:— ఆమె దేవకన్యరా బాబూ !

దాసు:—నీ వొక యక్షుడివీను !...(ఆవలించి) సరే కాని, కడుపులో ఆత్మారాముడి గోల అధికంగావుంది...నీ విందును నమ్ముకొని ప్రొద్దున్న టిఫిన్ కూడా తీసుకోలేదు.

మధు:—నీకు డిసప్పాయింట్మెంట్ వుండదు కాని, వాళ్ళనుకూడా రానీ—

దాసు:—(గడియారంచూచి) పదిన్నర ఐందికదా— ఇంకా రాలేదేమిటంట ?

మధు:—వొస్తార్లే—పాపం ! వాళ్ళకెన్ని అవస్థలున్నయ్యో ?...నన్నుగూర్చి కాస్త జాగర్తగా మాట్లాడరా బాబూ !

దాసు:—అంటే ?

మధు:—అంటే ? ఏంలేదు...ఆమె ఆంతరంగిక కార్యదర్శినితో నన్నుగూర్చి కాస్త గొప్పగా మాట్లాడితే, కల్యాణీదేవికి ఆ పాఠమంతా చేరుతుంది. యీవిధంగా ఆమెకు సదభిప్రాయం కలగటంవల్ల మనకు ఉత్తరోత్రా...

దాసు:—చూశావా! సరుకుమంచిదైనా ప్రకటనలు ఎంత అవసరమో!

[మెట్లమీద కిలకిల నవ్వులు వినిపించినయ్]

మధు:—(లేచినిలబడి) ఉండు...వొస్తున్నారు...... వొస్తున్నారు...

దాసు:—గంతులు వెయ్యక కుదురుగా కూర్చో. వాళ్ళు రాగానే పన్నీరు చల్లి, గంధం రాయి—

[కల్యాణీ, పద్మా వొచ్చారు]

కల్యా:—నమస్కారం—

పద్మ:—నమస్కారం—

దాసు:—ఉభయులకూ సాష్టాంగ నమస్కారం!

మధు:—డిటో...డిటో...డిటో

[కల్యాణీ పద్మా నవ్వారు]

కల్యా:—చాలా ఆలస్యమైంది. క్షమించండి.

దాసు:—అసలు రారేమోనని మావాడు దిగులుపడుతున్నాడు.

[చూశావా అన్నట్లు కల్యాణి పద్మవైపు చూసింది. మాటలధోరణి మార్చమని చెప్పేటందుకు మధు దాసుకాలిమీద తొక్కాడు. దాసు కాలు అవతలికి లాక్కున్నాడు]

పద్మ:—అంతేనా? మేము రామని విందుతయారు చేయించకుండానే ఉన్నారేమోనని కల్యాణీదేవి దిగులు పడుతోంది.

[చూశావా అన్నట్లు మధు దాసువైపు చూశాడు. ఆవిధంగా మాట్లాడటం మంచిదికాదని సూచించేందుకగాను కల్యాణి, పద్మ కాలు తొక్కింది. పద్మ తనకాలు అవతలికి లాక్కుంది.

కల్యా:—(తేరిపార చూస్తూ) మీ స్టుడియో చాలా బాగున్నదండీ !

మధు:—ఏదోలెండి...ఇంతకన్నా పెద్దఇల్లు తీసుకొని, కాస్త పెద్దఎత్తున చిత్రరచన చేద్దామను కుంటున్నాను.

కల్యా:—అట్లాగా ?

మధు:—అన్నట్లు ఫోటోను దగ్గరుంచుకొని మీబొమ్మ గీశాను. ఏమైనా కుదిరిందేమో చూడండి.

[అందరూ అతనివైపుచూస్తారు. అతను హాలుచివరికి వెళ్ళి, స్టాండు మీది గుడ్డను లాగి పారేస్తాడు. దాసు, పద్మ చప్పట్లుకొట్టారు, కల్యాణి ఆశ్చర్యబోయి అలాగేచూస్తూ ఉండిపోయింది]

పద్మ—(కల్యాణివైపు తిరిగి) ఎంత అందంగా వున్నావో చూడు.

కల్యా:—అదేచూస్తున్నాను : ఇంత అందగత్తెనని ఎన్నడూ అనుకోలేదు.

మధు:—నే నసలు రాయటంలో చెడగొట్టానేమో నను కుంటున్నాను.

దాసు:—నీవురాసిన అన్ని చిత్రాల్లోకీ ఇది చాలా అద్భుతంగా వుందోయ్—

పద్మ:—కల్యాణీదేవిని పెళ్ళికూతురల్లే అలంకరించారే! ఆభరణాలు స్త్రీకి ఎంత సౌందర్యాన్ని చేకూరుస్తవో ఇప్పుడే అర్థమౌతోంది.

మధు:—నావుద్దేశం అది కాదు. కల్యాణీదేవి సౌందర్యమే ఆభరణాలకు కొత్త అందాన్ని ఇస్తోంది.

కల్యా:—చూడబోతే చిత్రకారులుకూడా ఐంద్రజాలికుల్లే వున్నారు.

మధు:—ఏం అలా అన్నారు?

కల్యా:—నాలోలేని సౌందర్యాన్ని బొమ్మలో లాక్కొచ్చారు.

మధు:—ఈ బొమ్మను యీనాడు మీకు బహూకరించాలనుకున్నాను.

పద్మ:—(కల్యాణి పొరపాటున ఒప్పుకుంటుం దేమోనని తొందరగా) వొద్దు. హాస్టల్ గదిలో యీ బొమ్మ వేళ్ళాడుతూంటే కల్యాణి స్కాలర్‌షిప్‌కు నీళ్ళొధారే!

కల్యా:—ఔనండోయ్!

పద్మ—ఈ బొమ్మను బ్రహ్మాం చూస్తే...

[పొరపాటున నోరుజారినందుకు పద్మ నాలిక కొరుక్కుంటుంది. కల్యాణి పద్మవైపు తీక్షణంగా చూస్తుంది. మధూ, దాసూ ఒకరిమొహాలు ఒకరు చూసుకుంటారు]

మధు:—చాలా ఆలస్యమైనట్లుంది......భోజనాలకు వెళ్దామా?......సారంగం!

[కస్త్రాడు సారంగం వొచ్చాడు. గూడకట్టు, బనీను ధరించాడు. ఇరవైయేళ్ళ వయస్సుంటుంది]

సారం:—సార్ ?

మధు:—వడ్డన ఆరంభిస్తావా ?

సారం:—ఓ :

[సారంగం వెళ్ళిపోతాడు. మిగతా అందరూ లేచి వొకళ్ళవెనుక వొకళ్ళుగా వెళ్తూండగా తెర]

## IX

[స్టుడియోలో మధూ, దాసు మాట్లాడుకుంటున్నారు]

దాసు:—రెండు నెలలైందికదా! ఇంతవరకూ ఆలూ లేదు. సూలూలేదు. ఆమెతో ఏకాంతంగా మాట్లాడే అవకాశాల్ని ఎన్నిటిని కల్పించినా నీవు ఏమీ తేల్చుకో లేకుండా వున్నావంటే—?

మధు:—ఏంచెయ్యమంటావ్ ? నా అవస్థకూడా ఆలోచించు. ఆమెను యెంతపొగిడినా, జీర్ణించుకుంటుందామె! ఆ పొగడ్తకు సహజంగా ఉబ్బితబ్బిబ్బవుతే, ఆ మూడ్‌లో తేల్చుకుందామంటే...

దాసు:—పోనీ కాస్త కవిత్వం రాయకపొయ్యావ్ ?

మధు:—దాదాపు ఆధోరణిలోనే మాట్లాడాను... వింటూ నవ్వుతుంది. ఆ నవ్వు నా పిచ్చకు హెచ్చరికేమో ననిపిస్తుంది.

దాసు:—ఒరేయ్! స్త్రీ మనస్తత్వాన్ని జాగర్తగా పరిశీలిస్తూ ఉండాలిరా! తొందరపడకపోయినా ప్రమాదమే, తొందరపడ్డా ప్రమాదమే!

మధు:—మరి ఎట్లాగంట? యెప్పుడు తొందరపడాలో, యెప్పుడు తొందరపడకూడదో నాకే తెలియకుండావుంది; నేనంత రసికుణ్ణి కాదనుకో, అందుకనే నాకు అంతా అగమ్య గోచరంగావుంది. ఆ పద్మావతికి నీద్వారా నా తహతహ అంతా చెప్పించుకున్నానా! యింకా యేంచేయమంటావ్?

దాసు:—ఆ పద్మావతి మాటల్నిబట్టిచూస్తే, కల్యాణీ దేవికి ఆమె మేనమామకొడుకు బ్రహ్మం సైంధవుడల్లే అడ్డం వున్నట్లు తోస్తుంది.

మధు:—యీ మధ్య కల్యాణీదేవికూడా ఆ బ్రహ్మన్ని గూర్చి తరుచు చెపుతూనేవుంది. వాడేదో యీమెకు చాలా సహాయంచేశాడట! ఒక రకంగాచూస్తే అతను యీమెను వివాహంమాడేందుకే కఠిన బ్రహ్మచర్యాన్ని అవలంబిస్తున్నాడట! తన బంధుమిత్రులుకూడా తన వివాహం బ్రహ్మంతోనే అవాలనే వాంచిస్తున్నారట!

దాసు:—నాకూ అదేభయంగావుంది. మనం యిన్ని అవస్థలూ పడుతూంటే, మధ్య యీ బ్రహ్మంగాడు తన్నుకుపోతాడేమో? చివరకు నీకు ఆ జన్మాంత బ్రహ్మచర్యం, ప్రేమబికారత్వం సిద్ధిస్తయ్యేమో! ఆ రెండూ కాకుంటే సైసైడే గతవుతుందేమో?

మధు:—ఎవడీ బ్రహ్మం పానకంలో పుడకల్లే? ఆమెకు వీడి బెడద వుండబట్టే, నాకు తగిన అవకాశాన్ని యివ్వటం లేదల్లే వుంది.

దాసు:—పద్మావతి మాటలధోరణికూడా అదే! బ్రహ్మం రోజూ కల్యాణిని దర్శిస్తాడట. ఇంతవరకూ కల్యాణి తన అంగీకారాన్నయితే యివ్వలేదు కాని—నిరాకరణను కూడా తెలియపరచలేదట—

మధు:—ఎందుకనీ?

దాసు:—ఏముందీ? యేదో మొహమాటమంటూ వుండకపోదుగా! చిన్నతనంనుంచీ పరిచయమున్న వ్యక్తాయె! ఆమెను యెంతో ప్రేమిస్తూ ఆమె చదువులకు డబ్బిస్తూ ఆదరిస్తున్నాడాయె! తనమీద కొండంత ఆశతో వున్నాడాయె! మరి కుండ బద్దలు కొట్టినట్లు చెప్పటం యెలా? నా వుద్దేశం యేమంటే ఆమె మీ యిద్దరిమధ్యా తేల్చుకోలేకుండావుందోయ్!

మధు:—అసలు బ్రహ్మంమీద ఆమెకు అభిమానం యెందుకుండాలంట?

దాసు:—ఏమో! అది మనకెలా తెలుస్తుంది? ఆమే చెప్పాలి. బహుశా ఆమెకూడా యిప్పుడు చెప్పలేని స్థితిలో వుండొచ్చు...

మధు:—మన బుద్ధిపోయినంతవరకూ...

దాసు:—అలా ఆలోచిస్తే, బ్రహ్మంనుంచి ఆమె చాలా సహాయం పొందింది—

మధు:—ధన సహాయమేగా ?

దాసు:—కావొచ్చు...

మధు:—ఐతే ఆ సహాయం నేనూ చేస్తాను. నెల రోజుల కింద వందరూపాయిలిచ్చాను.

దాసు:—(ఆశ్చర్యంగా) అట్లాగా? నాతో చెప్పనేలేదేం? యీ రకంగా డబ్బు తగలేస్తే నేను కోప్పడతానని చెప్ప లేదు. అబ్బాయీ ! అటో ఇటో తేలకముందే యీ పెట్టుబడి దేనికంట ?

మధు:—నేను ఆమె ప్రణయాన్ని ఖరీదుకు కొందామనే ఉద్దేశంతో ఆ పైకం యివ్వలేదు. ఆమె బీదతనానికి జాలి పడ్డాను—అంతే !

దాసు:—అబ్బో ! నీకు బీదవాళ్ళంటే కలిగిన యీ జాలినిగూర్చి తలుచుకుంటే నవ్వుకూడా వొస్తోంది. ఆమె కన్న హీనులైనవాళ్ళకు కానీకూడా ధర్మంచేయని నీవు, ఆమెపట్ల యీ గొప్ప సానుభూతిని ప్రకటించావంటే—

మధు:—ఆమె అంటే నాకున్న అభిమానంవల్లనే—

దాసు:—అదేనోయ్ ! ప్రణయంలో అదొక భాగ మనుకో...ఐనా నీకు డబ్బు ఎక్కడిదీ ?

మధు:—ఎక్కడిదేమిటి ? ఒక స్నేహితుడిదగ్గర అప్పు తీసుకున్నాను—

దాసు:—ఐతే నీ స్వంతమే కాకుండా ఇతరుల డబ్బుకూడా త్యాగం చేసేందుకు సిద్ధంగా వున్నావన్నమాట ? నీ త్యాగ బుద్ధికి ఒక పెద్ద ఖజానా అన్నా వుంటేకాని సరిపోదు.

మధు:—ప్రణయ సాగరంలో పడ్డాక 'మన' డబ్బుకూ, ఇతరుల డబ్బుకూ భేదమేమీ కనిపించదోయ్—

దాసు:—ఔనౌను...అదివరకు చేసిన అప్పులన్నీ తీర్చ లేకపోయినా, ఆమెకు ఇచ్చేందుకు ఇంకా అప్పులు చేస్తున్నా వన్నమాట ?

మధు: — అప్పేగా !

దాసు:—తీర్చే బాధ్యత లేకపొయ్యాక 'అప్పు' అంత బాధగాకూడా లేదు...

మధు:—అదిసరే—ఆ విషయాలు అంత ముఖ్యమైనవి కావనుకో—

దాసు:—నీకు ముఖ్యమైనవా కావా అనికాదు ప్రశ్న. నీకు అప్పు ఇచ్చినవాళ్ళకు ముఖ్యమా కాదా అని.

మధు:—ఆఁ, అదేముంటలే! అప్పుచేసిన క్రొత్తలో బాధగా వుండేది. అప్పులవాళ్ళను తలుచుకుంటేనే భయం వేసేది. ఇప్పుడు కాస్త అలవాటైపోయింది. అసలు నేను సరిగ్గా పనిచెయ్యటం మొదలెడుతే నేనే చాలామందికి అప్పు లిచ్చేవాణ్ణి తెలుసా ?

దాసు:—అప్పుడు ఆ ప్రాముఖ్యత అర్థమౌతుంది...!

మధు:—అది సరేకాని, మనకు చేతనైన ధనసహాయం మనమూ చేస్తున్నాంకదా—

దాసు:—మళ్ళీ మొదటికి వొస్తున్నావ్. ధనానికీ ప్రణయానికీ సంబంధంలేదు; యీప్రణయం దేవతాప్రణయమన్న ధోరణిలోనే మాట్లాడుతున్నావ్ కదా !

మధు:—ఔను—నీవు ఇందాక బ్రహ్మంచేసిన ధన సహాయంతోనే ఆమెకు బ్రహ్మం పట్ల అభిమానం కలిగిందన్నావుగా—

దాసు:—కావొచ్చన్నాను. ఆ రకంగాపోల్చినా నీవు వందే సమర్పించుకున్నావ్. వాడు ఇలాటి వందలు ఎన్ని ఇచ్చాడో మనకు తెలియదు. తెలిసినా ప్రయోజనంలేదు. ఎందుకంటే నీది ఎంత జాలిగుండె ఐనప్పటికీ ధనసహాయం చేయటంలో పోటీకి దిగేస్థితిలో మాత్రం లేవు.

మధు:—డబ్బు సంగతి వొదిలేద్దామనుకో—

దాసు:—ఇంకా అలాటివే అనేక కారణాలు ఉండొచ్చు. బ్రహ్మం ఆమె జీవితమంతా తెలిసినవ్యక్తి; పైగా బంధువు కూడాను. నిన్న కాక మొన్న ప్రారంభమైంది మీ స్నేహం—

మధు:—స్నేహబలం కాలపరిమితిమీదనే ఆధారపడి వుంటుందంటావా ?

దాసు:—ఒక్క కాలమే నిర్ణయించలేక పోవొచ్చు కాని, అదీ ఒక కారణమనక తప్పదు. ఏదైనా యీ సమస్యను తేల్చుకోవాల్సింది ఆమేకదా !

మధు:—పోనీ మనం యీ బ్రహ్మంగాణ్ణి వొదిలించలేమా ?

దాసు:—అదీ వొకరకంగా ప్రమాదమేనోయ్. ఆమె తేల్చుకోకముందే ఆ బ్రహ్మంగాడికి మనం యేమైనా హాని చేశామని ఆమెకు తెలుస్తే, ఇంతకుపూర్వం బ్రహ్మం మీద

లేని సానుభూతి ఏర్పడుతుంది! మనమీద ద్వేషంకూడా పెరుగుతుంది.

మధు:—మరేమిటి మార్గం ?

దాసు:—నీ అంతట నీవే తంటాలుపడి ఆమెను రంజింప జేసి, త్వరగా పుస్తెకట్టు.

మధు:—(నిట్టూర్చి) ఏం రంజింపచేయటమో ?

దాసు:—అవసరమైతే కాళ్ళమీదపడ్డా తప్పులేదోయ్.

మధు:—దాదాపు అంతపనీ చేశాను...కాని.

దాసు:—నేను అనుకున్నట్లే ఐంది. బహుశా నీబోటి వాళ్ళు చాలామంది ఆమె వెంట పడివుంటారు. నీలాగే ప్రార్థించికూడా వుంటారు. యీరకం మాటలకు ఆమె బాగా అలవాటుపడికూడా వుంటుంది.

మధు:—నన్ను ఇంకో భయం పట్టుకుంది; నాకు రోజు రోజుకూ దూరమౌతూ, బ్రహ్మానికి దగ్గరవుతున్న దేమోనని. ఎందుకంటే బ్రహ్మాన్ని గూర్చి ఆమె మాట్లాడేటప్పుడు నేనెంత నిర్లక్ష్యంగావున్నా, ఆమె గమనించకుండా నే మాట్లాడేస్తుంది. పోనీ బైటపడుదామంటే ఆమె కష్టపడుతుందేమోనని ఒక భయం. బ్రహ్మంమీద ఆమెకు కొంత సదభిప్రాయం లేకుంటే అతన్నిగూర్చి నాదగ్గర మాట్లాడటం దేనికీ ?

దాసు:—ఇదేవిధంగా నిన్నుగూర్చి బ్రహ్మందగ్గర మాట్లాడుతుందని నేను అనుకోను. ఎందుకంటే నీ వొకడివి తనకు పోటీగావున్నావని బ్రహ్మానికి తెలుస్తే, అతను తొందరపడి,

ఎలాగో మూడుముళ్లూ వేసేస్తాడు. ఒకరకంగా యీ సందిగ్ధంలో ఏంచేస్తే బాగుంటుందో నీ నోటివెంట వినాలని ఆశిస్తోందేమో ?

మధు:—అలాగూ అడగలేదు. ఐనా ఇలాటి సందర్భంలో నేనేం సలహా యివ్వగలను ? రోజురోజుకూ యీ సమస్య కొరుకుడుపడకుండా పోతోంది.

దాసు:—కనుక నే చేతులుకాలాక ఆకులుపట్టుకోవటం అనవసరం: వెంటనే యేదో వొకటి తేల్చుకోవటం మంచిది. ఇదివరకల్లే పిలిచినప్పుడల్లా ఆమె రావటంలేదు; అంటే ఆకర్షణ అప్పుడే తగ్గిందన్నమాట !

మధు:—ఎంత తీవ్రంగా ఆలోచించి, ప్రయత్నించినా ఆమెలో స్పష్టమైన కదలిక కనిపించటంలేదు...

దాసు:—అంటే నీ ఉద్దేశం ఆమే ముందుగా యీ ప్రస్తావన తేవాలనా ?

మధు:—కాదు. కనీసం సూచనన్నా లేదామె !

దాసు:—స్త్రీ ముందడుగు వేయదురా బాబూ ! నువ్వే ధైర్యం చెయ్.

మధు:—తెగిస్తే అసలుకే మోసం వొస్తుందేమోనని భయంకూడా పీడిస్తోంది. నాకు చేతనైనదంతా చేశానురా దాసూ!—మిగిలిందల్లా నీ తెలివితేటల్తో పదన్నా ఎత్తువేస్తే తప్ప లాభంలేదు.

దాసు:—ఇది బాగానేవుంది; అటూ ఇటూ చేసి నీ సమస్య నాకు తగిలిస్తున్నావ్.

మధు:—కష్టాల్లో ఆదుకునే మిత్రుడే మిత్రుడు.

దాసు:—ఈ కబుర్లకేంలేకాని—నేను చాలాదూరం ఆలోచించాను. మనిషి దూరమౌతున్నకొద్దీ వుండే ఆత్రుతా, ఆకర్షణా దగ్గరౌతున్నకొద్దీ ఉండదు...

మధు:—నాకు అర్థంకాలేదు.

దాసు:—విను: మొదట్లో మనం రమ్మనగానే వొచ్చే కల్యాణి, ఇప్పుడు ఒకటికి నాలుగుసార్లు రమ్మంటేనేకాని రావటంలేదు. మన ముక్కూ మొహమూ యెరగకుండానే మొదటినాడు పార్కులో కలుసుకుంది. క్రమంగా మొదట్లో వున్న ఆకర్షణ సన్నగిల్లిందన్నమాట. నాలుగుసార్లు బతిమాలించుకోవటంతో కల్యాణి విలువ హెచ్చింది: ఈబ్రహ్మాంగాడు మధ్యలో వొచ్చాడా? యీ పోటీ పడేప్పటికి ఆమె విలువ మరింత అధికమైంది: బ్రహ్మాంగాడిమీద నీ ద్వేషం ఎలా పెరుగుతోందో, కల్యాణీదేవిమీద మమకారం కూడా అలాగే పెరుగుతోంది. ద్వేషానికీ ప్రణయానికీ వున్న అవినాభావ సంబంధం చూశావా?

మధు:—చెప్పు—విశదంగా చెప్పు.

దాసు:—ఏమీలేదు. ద్వేషం, జలసీ—ప్రణయానికి అడ్డతోవలు!

మధు:—అంటే?

దాసు:—కాస్త బుర్ర ఉపయోగించు. బ్రహ్మాంగాడి మీద జలసీయే కల్యాణీదేవిపట్ల నీ అనురాగం వేగంగా

పెరిగేందుకు సహాయపడుతోంది. ఇదే మనస్తత్వాన్ని కల్యాణీదేవికి అన్వయించేట్లు చేయాలి.

మధు:—ఎట్లా ?

దాసు:—తన భర్తను వేరొక స్త్రీ వశపరుచుకుంటుందేమో ననే భయంవున్న భార్యదృష్టిలో, భర్త విలువ చప్పున పెరుగుతుంది. చెయ్యిజారిపోకుండా తన భర్తను కాపాడుకునేందుకు ఆమె ప్రయత్నించటం సహజంకదా ?

మధు:—నిజమే !

దాసు:—కనుక...ఇప్పుడు కల్యాణీదేవికి నీమీద జలసీ కలిగేట్లు చేయగలుగుతే, ఆమెదృష్టిలో నీ విలువను పెంచటమౌతుంది. యీ కొత్త హెచ్చరికవల్ల ఆమె బైటపడే అవకాశం ఏర్పడుతుంది; లేదా నీవే కాస్త ముందడుగువేస్తే ఆమె వెంటనే తన అంగీకారాన్ని ఇస్తుంది. యీ రకంగా ఐతే యీ ఎండాకాలం సెలవల్లోనే నీకు కల్యాణం...పై సంవత్సరానికల్లా ఆముదమూ, ఉయ్యాలా, పాలసీసా...

మధు:—బాగుంది—నాకు తగిన ఆంతరంగిక కార్యదర్శివి...సరేకాని యీ జలసీని కాస్త ఘాటుగా, వెంటనే కలిగించటం ఎలా ? మనకు పోటీగా బ్రహ్మంగాడు ఉన్నట్లే, ఆమెకు పోటీగా ఇంకెవర్నన్నా నిలబెట్టాలి. అంతేనా ?

దాసు:—ఎగ్జాక్ట్లీ, ఐతే ఏదో కాల్పనిక ప్రియురాలిని గూర్చి ఆమెకు నూరిపోయటం చాలా శ్రమతోకూడిన పని. ఆమెను నమ్మించటం కూడా కష్టం; చాలా కాలంకూడా పట్టొచ్చు...

మధు:—అందుకని నిజమైన ప్రియురాలినే దింపాలంటావా?

దాసు:—తప్పకుండా, అందువల్ల నష్టమేమీ ఉండదు. ప్లాన్ ప్రకారం జరుగుతే అతి త్వరలోనే నీ వొక ఇంటివాడి వౌతావ్.

మధు:—ఏదీ-ఆ ప్లాన్ కూడా వేసెయ్.

దాసు:—ఏంలేదు, కల్యాణీదేవిని రమ్మందాం. ఆమె వొచ్చేవేళకు లోపలిగదిలో నీ ప్రియురాలితో సరససల్లాపాల్లో ఉండు; నాకు ఇదేమీ తెలియనట్లుగా లోపల ఉన్నాడని చెపుతాను. ఆమె ఆదృశ్యాన్ని చూస్తుంది; ఇక నమ్మక తప్పదు. తాత్కాలికంగా అగ్నిపర్వతం ప్రజ్వరిల్లినా, తరువాత జాగర్తగా ఆలోచించుకొని, తన అజాగ్రతవల్లనే ఇలా జరిగిందని పశ్చాత్తాపపడుతుంది...

మధు:—ఇప్పుడీ ప్రియురాలు ఎలాగంట?

దాసు:—ఏ మెరకవీధినుంచో ఒక తెను బాడుగకు తెద్దాం.

మధు:—ఆ రిహార్సల్స్ నీవే దగ్గరుండి చేయించు. అప్పుడుకాని రక్తికట్టదు.

దాసు:—సరే-మంత్రసానితనానికి ఒప్పుకున్నాక తప్పేదేముంది? (గడియారం వొంక చూసి) ఐదుంబావు ఐంది కాస్త అటు బీచ్‌కి వెళ్దామా?

మధు:—సరిగ్గా సమయానికి జ్ఞాపకం చేశావ్. ఐదున్నర తరువాత అప్పాలవాళ్ళకి వాయిదా వేశాను...

దాసు:—(తత్తరపాటుతో లేచి) చెప్పవేం ? పదపద... యీ రంకుమొగళ్ళను పెట్టుకునేనా ఇంకా ఇక్కడ కూర్చు న్నావ్ ?

మధు:—(లేచి) సారంగం ! మేం బైటకివెళ్తున్నాం. ఎవరన్నా వొస్తే—

దాసు:—లేరని వాడే చెప్తాడులే...పద...

[మధూ, దాసూ వెళ్ళిపోతారు. క్షణం నిశ్శబ్దం, పద్మావతీ, కల్యాణీ వొచ్చారు. హాలులో ఎవరూ లేనందువల్ల కల్యాణి సోఫాలో కూర్చుంటుంది. పద్మ అటూ ఇటూ చూచి]

పద్మ:—మధుకుమార్ గారూ !

కల్యా:—అరనవోక—వొస్తార్లే.

[సారంగం వొచ్చాడు]

కల్యా:—ఉన్నారా ?

సారం:—లేరండీ—ఇప్పుడే బైటికివెళ్ళారు. బహుశా ఇప్పుడే రావొచ్చు. కాఫీ తెస్తాను.

[పద్మ కల్యాణిపక్కనే కూర్చుంటుంది; సారంగం లోపలికి వెళ్ళాడు]

పద్మ:—చెప్పకుండావొస్తే ఆయనెక్కడ దొరుకుతాడే ? మగమహారాజులుకదూ—స్వేచ్ఛగా తిరుగుతూంటారు.

కల్యా:—(విసుగ్గా) పోనిస్తూ, కాస్సేపు కూచుందాం. మరేం ప్రమాదంలేదు.

[మెట్లమీద చప్పుడౌతుంది. కల్యాణి ఆతృతతో చూసి, పద్మవైపు చూస్తుంది]

పద్మ:—ఎవరూ ?

కల్యా:—ఏమో—బహుశా బొమ్మ గాయించుకునేం దుకు వొస్తున్నారేమో ననుకుంటాను.

[రామ్మూర్తి వొచ్చాడు; ఈ యువతుల్ని చూసి ఆశ్చర్యబొయ్యాడు. కాని వెంటనే తమాయించుకొని—]

రామ్మూ:—మధుకుమార్ గారు ఉన్నారండి ?

కల్యా:—లేరు...వొస్తారు కూర్చోండి

[రామ్మూర్తి కుర్చీలో కూర్చున్నాడు, హాలంతా తేరిపారజూచి తృప్తికరంగా వున్నందుకు కుసుటబడ్డాడు. ఆ తరువాత పిట్టగోడకు ఇవతలగా స్టాండ్ మీదవున్న కల్యాణి బొమ్మ చూశాడు; తరువాత కల్యాణిని తేరపార జూచాడు. యీ బొమ్మ, ఆమె దేనని దృఢపరుచుకున్నాడు]

రామ్మూ:—మీరు బొమ్మలు రాయించుకునేందుకు వొచ్చారనుకుంటాను—

కల్యా:—(ఏంచెప్పాలో తోచక కాస్త ఆలోచించి) ఔనండీ !

రామ్మూ:—ఏమండీ ! ఈయన బొమ్మలు బాగా రాస్తాడంటారా?

కల్యా—చాలా గొప్పగా చిత్రిస్తారు...చూడండి నా బొమ్మ ఎంత బాగా రాశారో !

రామ్మూ:—నాకు చిత్రకళ అంత బాగా తెలియదనుకోండి. మొత్తంమీద ఆ బొమ్మలో జీవకళ ఉట్టిపడుతోందనిపిస్తోంది.....రాసినందుకు చాలా తీసుకుంటాడనుకుంటాను.

కల్యా:—మరి బాగా రాసేవాళ్ళు తీసుకోరూ?

రామ్మూ:—మీ చిత్రానికి ఎంతిస్తున్నారు?

[ఏంచెప్పాలో తోచక కల్యాణి పద్మవైపు చూస్తుంది; పద్మ ముంజేతిని చూపుతుంది]

కల్యా:—ఐదు వందలండీ!

రామ్మూ:—(ఆశ్చర్యంగా) ఏమిటీ! ఐదువందలా!

కల్యా:—ఆఁ! ఇంకా ఎక్కువకూడా ఇచ్చేవాళ్ళుంటా రనుకోండి...

రామ్మూ:—మరి యీవిధంగా వందలకు వందలు సంపా యిస్తూ, బాకీలు తీర్చడు అదేం ఖర్మమో?

కల్యా:—తమకు ఏమైనా ఇవ్వాలాండి?

రామ్మూ:—లేకపోతే యీతిప్పట ఎందుకమ్మా? ఎని మిది నెలల అద్దె ఇవ్వాలి.

[కల్యాణి పద్మవైపు చూస్తుంది; పద్మ ఎగతాళిగా చిరునవ్వు నవ్వ బోతుంది; కల్యాణి పద్మను ఉరిమిచూసి, ఆమె చిరునవ్వుకు అడ్డుపడు తుంది]

కల్యా:—అంటే ఎంత ఇవ్వాలండీ?

రామ్మూ:—ఎనిమిది ముప్ఫైలు-రెండొందల నలభై...

కల్యా:—నాతోనూ మీకివ్వవలసిన అద్దెసంగతి చెప్పారు లెండి—నేనింకా ఆచిత్రానికి డబ్బు ఇవ్వలేదు. మీకు ఇవ్వ వలసిన అద్దె నేను ఇస్తాను...రశీదు ఇవ్వండి.

రామ్మూ:—అదేం బాగుంటుంది. ఆయన మీదగ్గర తీసుకొని, నాకు ఇస్తే సరిపోతుంది. ఆయనదగ్గరకువొచ్చే

మీలాంటి కొత్తాదార్లకు యీ సంగతులన్నీ చెప్పానని ఆయన కష్టపడతాడుకూడాను ?

కల్యా:—ఇందులో బాధపడవలసిందీ, అనుమానించ వలసిందీ ఏమున్నదిలెండి. మీకు ఇవ్వాలన్న సంగతి ఇది వరకే నాతో చెప్పారాయె. ఎవరిద్వారా మీకు అద్దె ముడి తేనేం ?...మీకు అంత అనుమానంగావుంటే, పోనీ ఒకపని చేయండి. అద్దెతీసుకొని, రశీదు నాకు ఇవ్వండి. నేను అద్దె చెల్లించినట్లు తరువాత మెల్లిగా చెబుతాను...మీరుమాత్రం ఆయన్ను అడగొద్దు.

రామ్మూ:—ఈ డొంకతిరుగుడు పద్ధతి ఎందుకులెండి !

కల్యా:—అలాకాదు. మధుకుమార్ గారు మా నాన్న గారికి స్నేహితులు; అందుకని యీ చిత్రానికి నేను ధర చెల్లిస్తానంటే ఆయన ఒప్పుకోకపోవచ్చు. డబ్బు అవసర మైనా, డెలికెసీ అడ్డుపడుతుంది చూడండి!...పాపం ! ఆయన శ్రమకు మనమేమి ముట్టచెప్పలేకపొయ్యేమే అనే బాధ నాకు మిగులుతుంది...ఒకవేళ బతిమాలి, భంగపడి ఐదు వందలూ తీసుకునేందుకు ఆయన్ను ఒప్పించినా, ఆ డబ్బు మరోరకంగా ఖర్చయిపోయిందంటే. ఇప్పట్లో మీ అద్దె వసూలవదు. నేను చెప్పిన పద్ధతి మన ఉభయులకూ వీలు గానేవుంటుంది...ఎవరిద్వారానైతేనేం మీ అద్దె వస్తోంది కదా !

రామ్మూ:—అదీ నిజమే అనుకోండి !

[రామ్మూర్తి ఆలోచనలోపడ్డాడు]

కల్యా:—రశీదు రాయండి—

[కల్యాణి పైకంతీసింది. నోట్లకట్టవైపు రామ్మూర్తి ఆశగాచూశాడు]

రామ్మూ:—చూడండి... నేనేదోవొచ్చి ఇక్కడ గోల చేస్తూంటే మీరు బాకీ చెల్లించాల్సివొచ్చిందని ఆయన అనుకుంటాడేమో? మీ అంతట మీరు ఇస్తేనే తీసుకుంటున్నాను సుమండీ!

కల్యా:—అంతే! అసలు అద్దె వసూలైనట్లే ఆయనతో చెప్పకండి. ఆయన్ని అడగకుండావుంటే సరిపోతుంది.

రామ్మూ:—వసూలయాక ఎందుకు అడుగుతాను?

[కల్యాణి ఇచ్చిన పైకాన్ని తీసుకొని, రశీదు రాసియిస్తాడు]

రామ్మూ:—వొస్తానండీ—మరి శెలవు.

[లేచినవాడల్లా నిలబడి—]

రామ్మూ:—తమరు అన్యథాభావించకుండావుంటే ఒక సంగతి అడుగుతాను—

కల్యా:—అడగండి.

రామ్మూ:—ఏం లేదు.....మధుకుమార్ కూ, మీకూ చాలా స్నేహితమనుకుంటాను...అంటే—

పద్మ:—చాలా స్నేహం! యీమె అతన్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటోంది.

[కల్యాణి కళ్లు పెద్దవిచేసి పద్మవైపు ఉరిమి చూస్తుంది]

రామ్మూ:—(ఆశ్చర్యంగా) ఆఁ...కాని ఏదో అపరిచితుణ్ణి చెపుతున్నాననుకోకండి. మధుకుమార్ మంచివాడే కాని, వొట్టి నిర్లక్ష్యం. సరిగ్గా పనిచేస్తే సంపాయించగలడేమో కాని, ప్రస్తుతం వూరినిండా తలమునగా అప్పులు! సంపాయించింది జాగ్రత్తగా ఖర్చు పెట్టుకుంటాడనుకోను.

కల్యా:—అదంతా నాకు తెలుసులెండి.

రామ్మూ:—(మాటదక్కదని తేల్చుకొని) సరే—వొస్తానండీ!

[వెళ్ళి పొయ్యాడు]

కల్యా:—(కోపంతో) ఎందుకే అధికప్రసంగం చేస్తావ్?

పద్మ:—అత్తవారింటి పరిస్థితుల్ని తెలుసుకునే అవకాశాన్ని కలిగించేందుకు! అందులోనూ ఆయన ఇంటి యజమానికదూ! మధుకుమార్ ఎవరో ఆడవాళ్ళను ఇంటికి జేరుస్తున్నాడని అనుకొనిపోతాడేమో నని నిజం చెప్పేశాను...అయ్యగారి అప్పులచరిత్ర బైటపడింది!

కల్యా:—ఔను. పాపం: ఆయనేంచేస్తారు—కళను గుర్తించి, గౌరవించి, కళాకారుణ్ణి సుఖపెట్టగల వాతావరణం లేనప్పుడు?

పద్మ:—ఆయన అప్పులన్నీ నీవే తీర్చేట్టున్నావ్?

కల్యా:—ఏమే తీరుస్తే? నాకు బోలెడు ఆస్థివుంది. ఆయన అప్పులు తీర్చినందువల్ల తరిగేదేమిటి? ఇలాగన్నా చేస్తే ఏదో కళోపాసకుణ్ణి పోషించినట్లూ, కళకు ప్రోత్సాహమిచ్చినట్లూ అవుతుంది. ఆయన బీదవాడనే బాధ నాకు లేదు. బీదరికం నేరమా? నెల్లాళ్ళక్రితం నాకు వంద రూపాయిలిచ్చాడు గుర్తుందా?

పద్మ:—దాన్ని వడ్డీతోసహా తీరుద్దామనా?

కల్యా:—అదికాదు. ఆయన తనకు లేకున్నా నాకు ఇచ్చేందుకు వెనుకాడలేదు. తన అప్పుల్నిగూర్చి బాధపడకుండానే...

పద్మ:—నీకోసమనికూడా అప్పు చేసివుంటాడు!

కల్యా:—కావొచ్చు. ఏమైతేనేం—ఆయన బీదతనంతో నాకుపనిలేదు. ఆయనకుక్కూడా డబ్బువుంటే, నన్నసలు లెక్కచేసేవాడు కాదుకదా! అందుకని—

పద్మ:—సరే ఇంకేం—ఎలాగూ నిశ్చయించుకున్నావు కనుక, ఆ సంగతి ఆయనతో చెప్పేసి త్వరగా పప్పన్నాలు పెట్టిస్తే సరిపోతుందిగా?

కల్యా:—మొదటినుంచీ నన్ను చెప్పమంటావ్...... ఎట్లాగే?

పద్మ:—తప్పేముందీ? ఇలా సిగ్గుపడుతూ, బాధపడుతూ త్రిశంకు స్వర్గంలో వేళ్ళాడటంకన్న అమ్మో తుమ్మో తేల్చుకుంటే...?

కల్యా:—పురుషుడు ముందడుగు వేయాలికాని...

పద్మ:—పోనీ నీవు సూచనగానన్నా...

కల్యా:—నీగోల నీది. స్త్రీత్వాన్ని పాటించకుండా ఎలా? ఆయనే ఆ ప్రస్తావన తెస్తాడేమోనని ఆశగా చూడటం, ఆయన దిగజారటం ఇదీవరస.

పద్మ:—పోనీ అందుకైనా అవకాశం ఇచ్చావా అని?

కల్యా:—బోలెడు...ఆయన గ్రహించకపోతే నేనేం చేసేదీ? బ్రహ్మన్నిగూర్చి చెప్పినా ఆయనలో వేడిపుట్టటం లేదాయె!

పద్మ:—ఈ అంతరంగిక కార్యదర్శినికూడా బ్రహ్మన్ని గూర్చి ఆయన అంతరంగిక కార్యదర్శికి బ్రహ్మాండంగా చెప్తూనేవుంది.

కల్యా:—మరేమిటి మార్గం?

పద్మ:—ఇలాటి వ్యక్తిగత సమస్యలు, స్వయంగానే పరిష్కరించుకోవాలికాని, వాళ్ళమీదా, వీళ్ళమీదా ఆధార పడటం అనవసరం. కనుక ఈ సారన్నా నీవు ఒంటరిగా వొచ్చి, త్వరగా తేల్చిపారేసెయ్.

కల్యా:—నేనూ అదే అనుకుంటున్నాను. ఇవాళే ఆయన్నుకలిసి, డొంకతిరుగుడు మార్గంలోనన్నా, యీ సమస్యను భేదించాలి—

[మెట్లమీద చప్పుడైంది...పద్మా, కల్యాణి మాట్లాడటం ఆపి, ఆ వొచ్చే వ్యక్తికోసం ఎదురుచూస్తున్నారు...కిల్లికొట్టు నాయర్ రావటంతో ఇద్దరూ డిసప్పాయింట్ అయ్యారు...]

నాయ:—(అనుమానిస్తూ అటూ ఇటూ చూసి) మధు కుమార్ ఉన్నారండి?

కల్యా:—ఎందుకూ ?

నాయ:—రమ్మన్నారులెండి.....కాతా పూర్తిచేస్తా మన్నారు.

కల్యా:—అలాగా? ఏతాలూకు—ఎంత ?

నాయ:—సిగరెట్లతాలూకు......(పుస్తకంతీసి) ఎనభై మూడు రూపాయల, పధ్నాలుగణాల ముక్కానీ—

కల్యా:—ఇమ్మని నాకు చెప్పివెళ్ళారులే—

[నాయర్ ముఖం విప్పారింది, కల్యాణి డబ్బులెక్కించి ఎనభైఐదు ఇచ్చింది]

నాయ:—చిల్లర లేదండీ—

కల్యా:—అక్కర్లేదు...జమవేసేయ్.

[నాయర్ పుస్తకంలో జమరాసుకొని, నమస్కరించి వెళ్ళాడు]

పద్మ:—ఇంకా ఎంతమంది వున్నారో ?

కల్యా:—చూద్దాం. ఈ వాయిదాకు ఒక్కొక్కళ్ళే దిగుతారుగా !

[సారంగం కాఫీతెచ్చి ఇద్దరికీ ఇచ్చాడు కాఫీ త్రాగుతూ—]

కల్యా:—సారంగం! అయ్యగారు నీకేమన్నా ఇవ్వాలా?

[సారంగం చెప్పేందుకు సందేహిస్తాడు]

పద్మ:—చెప్పు. బాకీలన్నీ తీర్చమని అమ్మగారికి చెప్పి వెళ్ళారు.

సారం:—ఇవ్వాలమ్మగారూ! మీరాసప్పుడు ఖిందుకు వొచ్చారుచూడండి; అప్పటికి ఆరునెలల జీతం ఇవ్వాల్సి వుంటే ఇచ్చేశారు. మళ్ళీ యీ రెండు నెలలదీ ఇవ్వాలి.

కల్యా:—ఎంతివ్వాలీ?

సారం:—యాభై ఇవ్వాలండీ—

[కల్యాణి పైకం ఇస్తుంది, సారంగం తీసుకుంటాడు]

కల్యా:—నేను ఇచ్చినట్లు అయ్యగారికి చెప్పవోక. ఆయన్ను అడగకు—తెలిసిందా!

సారం:—అలాగే అమ్మగారూ!

కల్యా:—సారంగం! ఇంకా బాకీలు ఏమున్నయ్? వాళ్ళంతా రోజూ వొచ్చిపోతూంటారా?

సారం:—వొస్తూనే వుంటారండీ! ఇంటాయనకు ఇవ్వాలి...కిళ్లీకొట్లో ఇవ్వాలి—

కల్యా:—ఇంకా?

సారం:—పచారీకొట్లో ఇవ్వాలి—

కల్యా:—ఎంత?

సారం:—రెండొందలకు పైనే ఇవ్వాలండీ!

కల్యా:—ఇంకా?

సారం:— పాలవాడికో నలభై ఇవ్వాలి.

కల్యా:—ఊం.

సారం:—ప్రస్తుతానికి ఇవి తీరతే...!

కల్యా:—పోయి ఆ పచారీశెట్టి వాణ్ణి పిలుచుకొని వొస్తావా?

సారం:—అలాగేనండీ—

[సారంగం వెళ్ళాడు, పద్మా, కల్యాణీ, మాట్లాడుకోబోతూండగా, సారంగం షావుకారును వెంటబెట్టుకొని వొచ్చాడు]

సారం:—ఆయనే ఎదురొస్తున్నాడమ్మా! (షావుకారుతో) తియ్యవయ్యా పద్దు...

షావు:—(విప్పారినముఖంతో) రెండొందల నలభై రెండు రూపాయల అరణాల ఐదు పైసలు—

కల్యా:—జమరాయి—

[కల్యాణి పైకం లెక్కించి ఇచ్చింది. షావుకారు జమరాసి నమస్కరించి వెళ్ళిపొయ్యాడు]

కల్యా:—పాలమనిషికి నీవు ఇచ్చేసెయ్. నేను యిచ్చినట్లుమాత్రం అయ్యగారికి తెలియకూడదు.

[సారంగం తలూపాడు; కల్యాణి నలభై రూపాయలూ ఇచ్చింది. సారంగం కాఫీకప్పులు తీసుకొని లోనికి వెళ్ళిపొయ్యాడు]

కల్యా:—ఇవాళ ఆయన అప్పుడేదారు—

పద్మ—ఏం? నీకెలా తెలుసు?

కల్యా:—ఈ అప్పులవాళ్ళ బాధనుంచి తప్పుకు నేందుకు బైటికి వెళ్ళివుంటారు...

పద్మ—నీ వా బాధలు తీర్చావుగా?

కల్యా:—ఆ సంగతి ఆయనకు తెలియదుగా?

పద్మ:—ఐతే మనం వెళ్దాం...యీసారి నీ వాక్కు తెవే వొచ్చి అటో యిటో తేల్చిపారేసెయ్.

కల్యా:—సారంగం!

[సారంగం వొచ్చాడు]

కల్యా:—మేం వెళ్తున్నాంకాని...మేం వొచ్చినట్లు అయ్యగారికి తెలియకూడదు—

సారం:—సరే నండీ.

[కల్యాణి, పద్మా వెళ్తూండగా తెర]

## X

[స్టుడియో...దాసు కూర్చునివుంటాడు. మధు కాలుకాలిన పిల్లిలాగు అటూ, ఇటూ తిరుగుతూ వుంటాడు]

దాసు:— మరేం గాభరాపడవోక...ఆమె వొచ్చేటైం అవుతోంది. అనుకున్నది అనుకున్నట్లుగా జరగాలి.

మధు:—నాదేంవుందీ—నీవు చెప్పినట్లల్లా చేస్తాను.

దాసు:—పంకజం గదిలో నేవుందిగా—లోపల ఉండ రాదూ—ఇక్కడ దేనికి ?

మధు:—దానిదగ్గర కూర్చోలేక నే యిట్లా తిరుగు తున్నాను. ఇప్పటినుంచే అక్కడెందుకు ?

దాసు:—ఇలాటిపనులకు భలే పనికొస్తుందిలే!

మధు—నేను కాస్త అనుమానించినా, ఆమెమాత్రం నాకు వూపిరాడకుండా మెడకావిలేసుకొని నలపేస్తోంది.

ఇదంతా నటన అని నేను సూచిస్తూంటే, ఆమె నిజమేనని ప్రవర్తిస్తుంది...

దాసు:—అలాగేవుండాలి; ఎందుకంటే ఇది కాబివడబోసిన సత్యమని మనం నమ్మించాలి.

మధు:—పోనీ కల్యాణిదగ్గర చేస్తే సరిపోతుందిగా రిహార్సల్సకూడా...

దాసు:—(నవ్వి) రిహార్సల్స ఎంతబాగా జరుగుతే నాటకం అంత రక్తికడుతుందోయ్! నా అనుమానం ఏమంటే అసలు పంకజం నిన్ను గాఢంగా ప్రేమిస్తోందని.

మధు:—ఛా!...ఛా!

దాసు—ఒకవేళ కల్యాణీదేవి ప్రణయాన్ని నీవు సాధించలేకపోతే, పంకజాన్ని పెళ్ళాడుదువుకానిలే...అప్పుడు సైనైడ్ మింగాల్సిన ఖర్మ తప్పుతుందిగా!

మధు:—పంకజాన్ని పెళ్ళాడటంకన్న సైనైడ్ మింగటమే ఉత్తమోత్తమం—

[మెట్లమీద చప్పుడైంది]

దాసు:—ఉరుకు...లోపలికిపో......ఆమె వొస్తున్నట్లు వుంది.

[గాభరాగా మధు లోపలికి పరుగెత్తాడు. దాసు హడావిడిగా పక్కనే వున్న వార్తాపత్రిక తీసి సీరియస్‌గా చదువుతున్నట్లు నటిస్తూ, హాలులోకి ప్రవేశించబోయ్యే వ్యక్తికోసం ఎదురు చూస్తూంటాడు......కల్యాణి వొచ్చింది]

కల్యా:—ఎవరూ? దాసుగారా? నమస్కారం—

దాసు:—కూర్చోండి...

[దాసు తల పైకెత్తాడు, కల్యాణి కూర్చొని నవ్వింది. దాసుకు అర్థం కాలేదు]

కల్యా:—పత్రిక చదువుతున్నట్లున్నారు ?

దాసు:—ఔనండీ !

కల్యా:—తలకిందులుగాకూడా చదవగలరన్నమాట ! సమర్థులే !

[దాసు గాభరాపడి తెల్ల మొహంవేసి, పత్రికను సరిగ్గా తిప్పుతాడు]

కల్యా:—మీ స్నేహితులు లేరా ?

దాసు:—ఉన్నట్లున్నాడు...లోపలగదిలో...వెళ్ళండి.

[కల్యాణి వెళ్ళేందుకు సందేహించింది]

దాసు:—ఫర్వాలేదు—వెళ్ళండి.

[కల్యాణి ఒక్కక్షణం ఆలోచించి, లోనికివెళ్ళింది. దాసు నిట్టూర్చి, అటూ ఇటూ చూసి పత్రికమీదికి దృష్టిపోనిచ్చాడు; మళ్ళీ పత్రిక అక్కడ పడేసి, లోపల ఏంజరుగుతోందోనని చెవులు రిక్కించి వింటాడు. క్షణం నిశ్శబ్దం. తరువాత వేగంగా నడిచిన పాదాలచప్పుడు, బరువైన వస్తువేదో పడ్డ పెద్దచప్పుడు, దాసుకు అర్థంగాక గాభరాగా గుమ్మంవైపు చూస్తూంటాడు. కల్యాణి వేగంగా వొచ్చేసింది. ఆమె ముఖం అగ్ని జ్వాలల్ని కక్కుతోంది. ఫాలభాగం మీద స్వేదబిందువులు కనిపిస్తున్నవి]

దాసు:—(గాభరాగా) ఏమిటీ ?...ఏమైందీ ?

[కల్యాణి మాట్లాడాలని ప్రయత్నించింది; కాని ఆమె పెదవులు వొణికినవి; ఆ కోపంతో మాటలురాలేదు]

దాసు:—ఎందుకూ అలా వొణికిపోతున్నారు ? ఏదో బరువైన వస్తువుపడ్డ చప్పుడైంది. ఏమన్నా దెబ్బతగిలిందా?

కల్యా:—(ఒణికే గొంతుతో) తగిలింది...యీ జన్మకు మానని గాయమైంది.

దాసు:—నాకు అర్థమవటంలేదు.

కల్యా:—లోపలికి పోయిచూడండి.

[దాసు లోనికి తొంగిచూశాడు కాని, తనకు అర్థంకానట్లే శూన్య దృక్కుల్తో సూచించాడు. కల్యాణి కనుకొలకుల్లో నీరుపూరింది]

కల్యా:—మొగాళ్ళను నమ్మకూడదు...ఛీ...నీచులు!

[అక్కడ నిలబడలేక, విసురుగా వెళ్ళిపోబోయింది; దాసు ఆమె దారిని అడ్డగించి—]

దాసు:—ఏంజరిగిందో నాకు తెలియటంలేదు. ఏమన్నా పొరపాటు జరిగిందేమో?

కల్యా:—ఔను. పెద్దపొరపాటే జరిగింది. ఈ జన్మలో మరి దిద్దుకోలేనంత పెద్ద పొరపాటుచేశాను. నీటి బుడగను బట్టి నీటి లోతును వూహించాను. పైకి కనిపించే కళో పాసనా, ఉన్నత ఆశయాలూ, పెద్దమనిషితనం, సంస్కృతీ-పెద్ద పొరపాటు పడేందుకు సహాయంచేసినవి...

దాసు:—ఏమైందో సావకాశంగా కూర్చొని చెప్పండి—

కల్యా:—అనవసరం...ఇంకా యీ పాడింట్లో కూర్చోవటమా?...దారి వొదలండి ముందు—

[ఉరిమిచూసేప్పటికి దాసు దారి వొదలకతప్పలేదు]

కల్యా:—మీ స్నేహితుణ్ణే అడగండి—ఇద్దరూ కట్టుకుని చావండి...వెధవజాతి...మొగజాతి!

[కల్యాణి వెళ్ళిపోయింది; మధు వొచ్చాడు]

మధు:—మంచి ఎఫెక్టే వొచ్చినట్లుంది; నీకు మంచిరకం శాపనార్థాలు తగిలినట్లున్నయ్యే?

దాసు:—లోపల పెద్ద చప్పుడైతే, బరువైనదేదన్నా నీ తలమీద పగిలిందేమో ననుకున్నా.

మధు:—ఆ తొందర్లో ఆమె గంగాళాన్ని తన్నేసింది. ఆ కోపంలో శాపనార్థాలతోపాటు శాస్త్ర ఆయుధ ప్రయోగం కూడా నీమీద జరుగుతుందనుకున్నా.

దాసు:—మధ్య నామీద ఎందుకూ?

మధు:—నాకు ఆంతరంగిక కార్యదర్శివికదూ! అందు కని నాకు ముట్టవలసినవి, నీ ద్వారానే రావాలి.

దాసు:—బాగానేవుంది...ముందు ఆ పంకజాన్ని వొది లించు.

మధు:—దొడ్డితోవన అప్పుడే తోలేశా.

దాసు:—ఇంకేం ఉత్తరం రాయి...

మధు:...ఏమనీ?

దాసు:—నాద్వారా అంతా విన్నాననీ, యీ విష యంలో ఆమె నిన్ను అపార్థం చేసుకున్నందుకు విచారిస్తు న్నాననీ—

మధు:—ఈ ప్రణయఘట్టాన్ని సమర్థించాలి.

దాసు:—అఁ, కాదామరి? ఆర్టిస్టువి కనుక, మోడల్ పోజ్ చూపిస్తున్నట్లు చెప్పుకోవటం, జరిగిన పొరపాటుకు కాళ్ళా వేళ్ళా బడటం, క్షమార్పణాలు వేడటం...

మధు:—ఔనులే.....యీ కోపమంతా చల్లార్చాలి. అందుకని నీవేరాయి...నేను సంతకం చేస్తాను.

దాసు:—ఎంత ఖర్మ పట్టిందిరా బాబూ!

[దాసు ఉత్తరం రాస్తూండగా తెర]

## XI

[స్టుడియో...మధు ఏమీతోచని వాడల్లే అటూ ఇటూ పచార్లు చేస్తూ, ఎవరికోసమో ఎదురుచూస్తున్న వాడల్లే మాటిమాటికీ మెట్లవాకిలి వైపు చూస్తుంటాడు...క్షణం గడిచాక, దాసు వొచ్చాడు]

మధు:—(ఆతృతతో) ఏమైందిరా?

దాసు:—(సోఫాలో కూలబడి నిట్టూర్చి) అవవలసిందంతా ఐంది...ఆమె నిన్నిక తిడుతోందిరా...

మధు:—ఆడవాళ్ళచేతుల్లో తిట్లుతినడం మంచిదే లే... కల్యాణీదేవితో మాట్లాడావా?

దాసు:—ఆమెదాకా ఎక్కడ? పద్మావతితో మాట్లా డేప్పటికే తాతలు దిగివొచ్చారు. యీ సమస్య తేలినట్లే!

మధు:—అంటే?

దాసు:—నీకు మరి సైనైడే గతి!

మధు:—నిన్ను నమ్ముకున్నందుకు నిలువెల్లా ముంచావ్ రా?

దాసు:—కాదురా—...ఇందాకటినుంచీ ఆలోచిస్తున్నాను...మన స్తత్వం ఎక్కడ పెడదారిపట్టిందా అని... చూడబోతే మోతాదు ఎక్కువైనట్లుంది.

మధు:—ఏం మోతాదో.....అసలు జరిగినదంతా చెప్పరా?

దాసు:—ఏముందీ...గంటకుపైగా కాపలావేసి కాలేజీ గేటుదగ్గర పద్మను పట్టుకున్నా. చెప్పాకుంటే సిగ్గు...నన్ను చూడగానే తుపుక్కున ఉమ్మేసింది...

మధు:—రోడ్డుమీదనా, నీ మొహంమీదనా?

దాసు:—మొహంమీద ఉమ్మివేయబోయి రోడ్డుమీద ఉమ్మేసింది...

మధు:—నేను రాకపోవటం మంచిదే ఐంది.

దాసు:...మహానుభావుడివి...నీవుకూడా వొస్తే రోడ్డుమీద ఉమ్మెయ్యబోయి, మొహాన్నే ఉమ్మేసేది.

[మధు నవ్వాడు]

దాసు:—నీకు మహదానందంగా వున్నట్లుంది?

మధు:—లేదులే...ఆ తరువాత ఏమైందీ?

దాసు:—ఏమైతే ఐందని ఆమెను పలకరించాను. కాని ఆమె మాట్లాడుతేగా? ప్రార్థిస్తూ, బతిమాలుతూ, బేవాన్నె మొహంవేసుకొని ఆమెవెంట చాలాదూరం నడిచాను... ఎన్ని ప్రశ్నలు వేసినా జవాబులేదు. నేనసలు పక్కన లేనట్లే నటించింది.

మధు:—అంటే ఆమె హృదయానికి తగిలేట్లుగా మాట్లాడి ఉండవు...

దాసు:—ఇంకా నయం! మోకరించటం ఒక్కటే తక్కువనుకో......ఆపనీ చేసేవాణ్ణే కాని అది రోడ్డయిపోయింది.

మధు:—తారు రోడ్డేగా? కంకరాళ్ళు ఉండవ్‌గా?

దాసు:—నీతోడ స్నేహమే కంకరాళ్ళ దారల్లే తయారైంది. యీ మధ్యవర్తిత్వాల న్యూసెన్స్—

మధు:—లాయర్‌వైన నీకది అలవాటేగా?

దాసు:—లాయర్నయితే, పార్టీ చేత వ్యాజ్యం వేయిస్తాను కాని, సత్రకాయల్లే వాడికీ, వాడి విరోధికీ రాజీచేస్తానా యేం?

మధు:—రాజీ చేస్తే డబ్బులు గిట్టవ్‌గా? నావిషయంలో కూడా అలాగే ఉన్నావా అని?

దాసు:—(కోపంతో) ఆఁ, ఇంత పెద్దకేసు మరి దొరుకుతుందా? మెడలో నల్లపూసన్నా లేని ఆ కల్యాణీదేవి దగ్గరా, రేపో ఎల్లుండో ఐ. పి. దాఖలు చేయబోయ్యే నీదగ్గరా ఏం రాలుతయ్ కనుక?

మధు:—లేదులే......ఇలాటి ప్రజాసేవ చేయుటం మంచిది...సరేకాని తరువాత ఏమైందో చెప్పుదూ?

దాసు:—వెంటపడి, సాగతియ్యగా, సాగతియ్యగా చివరకు మాట్లాడించి,

మధు:—మనం రాసిన ఉత్తరాలు కల్యాణీదేవిగారు చదువుతోందా ?

దాసు:—చదవకుండానే చించిపారేస్తోందట!...పద్మావతి నిన్నిక దుమ్మెత్తిపోసింది! కల్యాణి కాలేజికి రావటం లేదట. ఒకటే ఏడుపు...

మధు:—మరి ఘాటైన ప్రేమోయ్—విరహతాపం.

దాసు:—నీవింకా దొడ్డితోవనే ఉన్నావ్......ఆమె మనస్సు చాలా తీవ్రంగా గాయపడిందోయ్.

మధు:—(బుర్రగోక్కుంటూ) ఒక్కసారి ఆమెను కలుసుకుంటే బాగుండును.

దాసు:—అసంభవం! ఆమెను యీ జన్మకు కలుసుకోలేవు...మరిచిపో.

మధు:—ఏం—అంత ఖచ్చితంగా అంటున్నావ్ ?

దాసు:—బ్రహ్మంతో తన వివాహాన్ని నిశ్చయించుకుందట!

మధు:—(అదిరి) ఏమిటీ!

దాసు:—పద్మావతి చెప్పింది...పై శుక్రవారంనాడు ముహూర్తమట!

మధు:—కథ ఇలా ఎదురుతిరిగిందేం ?

దాసు:—నీమీది యీర్ష్య బ్రహ్మంమీద ప్రణయంగా మారింది. చూస్తే మన స్తత్వం సరిగ్గానే పనిచేసిందనిపిస్తోంది?

మధు:—పద్మావతి ఇంకా ఏమందీ ?

దాసు:—ఆ తిట్లతో నాతల దిమ్మెక్కింది. విన లేము...

మధు:—నాకో ఆలోచన తడుతోంది.

దాసు:—ఏమిటో ఏడు.

మధు:—ఏంలేదు... పెళ్ళి చేసేందుకు ఉపయోగపడని నీ తెలివితేటలు, చెడగొట్టేందుకైనా ఉపయోగపడవా అని ?

దాసు:—నీ పెళ్ళి చెడ నే చెడిందిగా !

మధు:—బ్రహ్మంగాడి పెళ్ళి చెడగొడితే, మనకు కొంత వ్యవధి ఏర్పడుతుంది...ఆ తరువాత ఏమన్నా ఆశలు ఉండొచ్చు.

దాసు:—అదేం లాభంలేదు. నీ మొహం చూడకూడదని కల్యాణి నిశ్చయించుకొందట...ఇక ముందు తనతో మాట్లాడవొద్దని పద్మావతిని నాకు వార్నింగ్ కూడా ఇచ్చింది... కల్యాణి...నిన్ను ఎంత అసహ్యించుకుంటోందో తెలిశాక... నాకు మరి ఆశలు లేవు.

మధు:—ఎలాగైనా నచ్చచెప్పి ఉండాల్సింది.

దాసు:—నీదొకగోల. వాళ్ళసలు మనమాటల్ని పెడచెవిని పెడుతున్నారు? ఎంత బలమైన సాక్ష్యంవున్నా ఒకోసారి కేసు ఓడిపోతూవుంటుంది.

మధు:—ఛీ ! జీవితం ఇలా తారుమారవుతుందని ఎన్నడూ అనుకోలేదు. ఈ కల్యాణీదేవి జీవితంలో ఎదురవకపోయినా ఇంతబాధ వుండేదికాదు...నాకు మరి బతకాలని లేదు !

దాసు:—కానీ...ఏం చేస్తాం? ఆత్మహత్య చేసుకుంటున్నట్లు ఉత్తరాలు రాసి యీ సైనైడ్ వేసుకో......మన అందరి సమస్యలూ తీరుతాయ్ (జేబులోంచి కాగితాల మడతల మధ్యనుంచి చిన్న పొట్లం తీసి) జేబులో యీ పొట్లాన్ని దాయలేక ఛస్తున్నాను. ఎప్పుడన్నా ఏమర పాటున వుండి, వొక్క పొట్లాముని యీ కాస్తా మింగుతానే మోనసే భయంకూడా వుంది.

మధు:—కల్యాణీదేవికి చివరి ఉత్తరం రాస్తాను.

దాసు:—అనవసరం. ఆమె చదవక పోయినతరువాత ఉత్తరాలు రాయటం దేనికంట? జీవితంమీద రోసి ఆత్మహత్య చేసుకుంటున్నానసీ, దీనికి ఎవరూ కారకులు కారనీ రాయి, జనరల్‌గా వుంటే చాలు.

మధు:—నేను ఛస్తే ఏడ్చేట్లుకూడా లేవు.

దాసు:—ఏడుస్తూ కూర్చుంటే దహనక్రియలూ అవీ ఎవడు చేస్తాడంట? నక్షత్రం మంచిది కాకుంటే ఇల్లు పాడు పెట్టాల్సి వొస్తుందేమోనని రామ్మూర్తి భయపడుతాడు. పోతే శవపంచాయితీ, పోలీసుల విచారణా మొదలైనవి ఉండనేఉన్నయ్...ఎవరు ఏడ్చినా, ఏడవకపోయినా—సీ అప్పులవాళ్ళంతా హృదయపూర్వకంగా, ఆత్మసాక్షిగా లబోమని ఏడుస్తారులే!

మధు:—ఇలా ఆలోచిస్తూ కూర్చున్నకొద్దీ బుర్ర వేడెక్కి పిచ్చెక్కేట్లుకూడా వుంది. ఆ ఉత్తరమేదో రాసెయ్... సంతకంచేస్తాను.

దాసు:—ఇంకా నయం! ఛస్తూ ఛస్తూ నాకు సముద్ర యానం కల్పించేట్లున్నావే ?

మధు :—అంటే ?

దాసు:—అండమాన్స్‌కు పంపుతారు...ఆ ఉత్తరం ఎవరికీ తెలియకుండా రాసినట్లుండాలి. నీవు చచ్చాక కాని అమూల్యమైన నీ యీ వ్యక్తిగతమైన ఉత్తరం బైటికి రాకూడదు. రాయి...రాయి...

[మధు సీరియస్‌గా రాస్తాడు]

మధు—(ఉత్తరం అందిస్తూ) చూడు-సరిపోతుందేమో ?

దాసు:—బాగానే రాశావ్ రా ! చావు తెలినంటే ఇదే! ప్రణయలేఖలు రాయటం చేత కాకపోయినా, యీ రకం ఉత్తరాలు రాయటమన్నా చేతనైంది......సంతకం చేయకుండా ఉంచావ్...నన్ను చేయమనా ?

[ఉత్తరం తిరిగి ఇచ్చేశాడు. మధు సంతకంచేసి దాసుకు ఇవ్వబోయ్యాడు]

దాసు:—నాకు దేనికీ? నీ జేబులోనే భద్రంగావుంచుకో. శవపంచాయతీ సమయంలో పెద్దల సమక్షంలో దాన్ని బైటికి లాగుతాము...

(పొట్లం అందిస్తూ) లోపల పొడివుంది. నోట్లో వేసుకో—

మధు:—తియ్యగా వుంటుందా ?

దాసు:—జీవితమే చేదుమయమైన నీకు ఇది ఎలావుంటే నేమిటి? ఐనా నేనెప్పుడూ రుచిచూడలేదు. అలా చూసిన వాడెవడూ, రుచినిగూర్చి చెప్పేందుకు బతికిలేడు కూడాను.

మధు:—పోనీ దీనికి అనుపానం ఏమిటి? తేనా? పాలా? నీళ్ళా?

దాసు:—తేనా, పాలూ ఐతే ఖర్చు. నీళ్ళు చాలులే... కాసిని నీళ్ళు తేనా?

మధు:—నేను నిజంగా ఛస్తే కల్యాణి విచారిస్తుందంటూవా?

దాసు:—ఏమో—ముందు జరిగేది నేనెలా చెప్పేదీ? ఆతరువాత చూసి, నీవు ప్ భూతానివన్నా ఐ కలలో కనిపిస్తే చెపుతాను.

మధు:—నామీద ఎవరికీ సానుభూతికూడా లేదుకదా?

దాసు:—బహుశా చచ్చాక చాలామంది సానుభూతి చూపుతారు... కానీ ఆలస్యం విషం, అమృతం—అన్నారు!

[మధు పొట్లాం విప్పబోతూ ఉంటాడు]

దాసు:—ఆగు...ఒక్క క్షణం ఆగు—

మధు:—ఎందుకూ? అనవసరం. మళ్ళీ కాస్సేపు వుంటే ఈ పట్టుదల పోతుంది.

దాసు:—ఆగవోయి మజునూ! నాకొక ఆలోచన తడుతోంది.

మధు:—ఏమిటో త్వరగా చెప్పు. ఇప్పటికే చాలా ఆలస్యమైంది.

దాసు:—కాస్త గుర్రాన్ని కట్టెయ్. ఈ బండి కాకుంటె, తరువాత బండిలో సుఖంగా ప్రయాణంచేయవొచ్చు... ఇప్పుడు నీవు నిజంగా సైనైడ్ మింగి మరణిస్తావనుకో. ఈ సంగతి కల్యాణికి తెలిసి పరుగెత్తుకుంటూ వొచ్చి, ఇంత అఘాయిత్యం చేసినందుకు దుఃఖ్యాపడుతుందనుకో—

మధు:—నేను మరణిస్తానుకనుక, తిట్టినా నాకు తగలవు. పోతే ఆ దూషణలూ, భూషణలూ నా అంతరంగిక కార్యదర్శివైన నీకే...

దాసు:—నీకా? నాకా? అని కాదు. ఇంత పొరపాటు జరిగినందుకు ఆమె పశ్చాత్తాపపడుతుందనుకో. ఈ పని చేయబోయ్యేముందు కనీసం తనకు తెలియపరచనందుకు విచారిస్తుందనుకో—

మధు:—విచారించినా, పశ్చాత్తాపపడినా, నేను చచ్చాక నేకదా?

దాసు:—ఆమె నిన్ను గాఢంగా, హృదయపూర్వకంగా ప్రేమించినట్లయితే, లైలామజునూలలాగు నీతోపాటు ఆమె కూడా ఆత్మహత్య చేసుకుంటుంది!

మధు:—మరీనయం... ఆ స్వర్గంలో ఇద్దరం హాయిగా కలుసుకుంటాం. నీబోటి అంతరంగిక కార్యదర్శి బెడద నాకూ ఉండదు; పద్మలాటి అంతరంగిక కార్యదర్శిని బాధ ఆమెకూ ఉండదు! మరోపోటీ లేకుండానే పెళ్ళిచేసుకుంటాం!

దాసు:—ఏడిశావ్ లే. బతికి భూలోకంలో సాధించలేనిది, చచ్చి స్వర్గంలో సాధించే దేమిటి?

మధు:—నేను చచ్చాక ఏమవుతుందో నీకే తెలియాలి.

దాసు:—నాకు తెలిసేం? తెలియకేం?.....ఆమె హృదయం ద్రవించి, తన జీవితాన్ని నేలపాలు చేసుకున్నందుకు పశ్చాత్తాపపడుతే, ఏ విధి కరుణవల్లనో, ఆమె జీవితాన్ని వెలిగించేందుకు నీ ప్రాణం మళ్ళీ తిరిగి వొస్తుందనుకో...

మధు:—పిచ్చిరా బాబూ! పిచ్చి! పోయిన ప్రాణం మళ్ళీ వొస్తుందా?

దాసు:—వొస్తుందిగా! మన తెలివితేటల్తో మళ్ళీ బతికిస్తానుగా! యీ ఎత్తువేసి చూద్దాం. రెండు రోజులపాటు నీవు నిరాహారదీక్ష పూను—

మధు:—కాలేజీదగ్గర్నా?

దాసు:—కాలేజీదగ్గరైతే పోలీసులు తీసుకెళ్తారు. ఇంట్లోనే...

మధు:—ఈ సంగతి పేపర్లో వేయిద్దామా?

దాసు:—ఉహుఁ. ఈ నిరాహారదీక్ష అన్ అఫీషియల్. ఇందువల్ల నీవు కాస్త నీరసంగా కనిపిస్తావ్.

మధు:—ఏం లాభం?

దాసు:—అంటే కాస్త చావుకళ మొహంలో కనిపిస్తూవుంటుంది. నీవు సైనైడ్ మింగావనీ, అవసానదశలో ఉన్నావనీ ఆమెకు కబురుపెడదాం...

మధు:—పీడ వొదిలిందనుకుంటుంది. ఇందువల్ల బ్రహ్మాంగాడితో ఆమె పెళ్ళివాయిదాపడుతుందంటావా?

దాసు:—నీ చేతిలో కళవున్నదికాని, బుర్రలో మెదడు లేదురా బాబూ! బ్రహ్మంగాడి గొడవెందుకోయ్? ఆమె విచారిస్తుందిరా బాబూ!—అప్పుడు భూమ్యాకాశాలను గాలించి ఏదో సంజీవి చికిత్స చేయించి నిన్ను బతికిస్తాం. అప్పుడు ఆమె—

మధు:—క్షమిస్తుందంటావా?

దాసు:—చావుబతుకుల మధ్య కొట్టుకుంటూన్నవాణ్ణి చూస్తే ప్రణయసంగతి ఎలా వున్నా కనీసం మానవత్వానికి చూపే సానుభూతినా దక్కుతుంది. నీవు బతికే ఆశలు బహుకొద్ది అని డాక్టర్ చెపుతున్నాడంటే, ఎంత కఠినురాలైనా, కరగకపోదు. నా నమ్మకం ఏమంటే పిడుగులాటి ఈ వార్త వినగానే ఆమె పరుగెత్తుకుంటూ ఇక్కడికి వొస్తుంది.

మధు:—ఆమె రాగానే లేచి వెళ్ళి ఆమె కాళ్ళమీద పడి క్షమించమంటాను.

దాసు:—ఏడిశావ్! ఇక్కడికి వొచ్చాక డాక్టర్ చేత 'ఎంత బతిమాలినా మందు తాగటంలేదనీ, జీవితమంటే విరక్తిగా వున్నాడనీ' చెప్పిద్దాం. అప్పుడు ఆమే నిన్ను బతిమాలుతుంది. నీ హిరణ్యాక్షవరాలన్నీ ప్రసాదిస్తుంది.

మధు:—ఈ ప్లాన్ బాగానేవుందిరా! కాని సైనైడ్ మింగాక, బతకటం ఎలా?

దాసు:—సైనైడ్ ఎందుకురా మింగటం? సైనైడ్ మింగినట్లు నటిస్తే సరిపోతుంది.

మధు:—ఒకవేళ కథ అడ్డంతిరుగుతే ?

దాసు:—అప్పుడు...నిజంగా సైనైడే మింగుతే సరి పోతుంది.

మధు:—ఈ రంగం ఎప్పుడు ?

దాసు:—ఎల్లుండి సాయంత్రం. ఈలోగా పద్మావతితో నాయకుని అవస్థ చూచాయగా చెప్పివుంచుతాను. రాబోయ్యే దృశ్యానికి ఒకరకంగా వాళ్ళు సిద్ధపడివుంటారు.

మధు:—భలే బుర్రరా నీది! (దాసుతలమీద చిటిక వేస్తాడు)

[తెర]

## XII

[స్టుడియోమధ్యలో మంచంమీద తెల్లని దుప్పటి వేసివుంది. తలవైపున ఎత్తైన రెండు తలగడాలు అమర్చబడి ఉన్నవి. మధు మంచంమీద కూర్చొనివున్నాడు. వొదులు లాగూ, వొటులు చొక్కా వేసుకున్నాడు. చొక్కాకు పైన వున్న రెండు గుండీలూ పెట్టలేదు. మనిషి నీరసించి వున్నాడు. జుట్టంతా రేగివుంది, మొహమంతా జేవురించివుంది. దీనత్వం ఉట్టిపడేట్టుగా చూస్తున్నాడు.

కుర్చీలూ, సోఫాలూ స్టుడియో ముందుభాగంలోనే అమర్చబడి ఉండ టంవల్ల అవతల ఖాళీవొచ్చింది. ఒక్క కుర్చీమాత్రం మంచందగ్గరగా వుంది. ఆ కుర్చీకి పక్కనే అత్యవసర సమయంలో ఉపయోగించే మందు లూ, వైద్యపరికరాలూ వున్న తోలుసంచీ మొదలైనవి ఉన్నవి. తోలు సంచి తెరిచివుంది.

మూలాన స్టాండుమీద నీళ్ళబేసిన్; ఆ పక్కనే సబ్బూ, వేళ్లాడే తువ్వాలూ, నలభైఏళ్లాయన తెల్లని సూట్‌లో, బూట్లు టకటకలాడిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడు. మనిషి చాలా గంభీరంగా వున్నాడు. మెడలో వేళ్లాడే స్టెతాస్కోప్‌ను చూడగానే డాక్టరనే అభిప్రాయం కలుగుతుంది.

[దాసు ముందుభాగంనుంచి అంతా తేరిపారచూశాడు]

దాసు:—నీవు పడుకొనే ఉండరాదూ—వాళ్ళు ఏక్షణాన్నయినా రావొచ్చు.

[మధు కిక్కురుమనకుండా పడుకున్నాడు]

దాసు:—అటువైపు తిరగివుండు; లేకుంటే ఆమె రాగానే ఆత్రుతకొద్దీ కళ్లు తెరిచావంటే యీసారి పేడనీళ్ళు పడతయ్.

మధు:—(నవ్వి) నవ్వొస్తోందిరా.

దాసు:—అట్లా నవ్వావంటే అంతా రసాభాస అవుతుంది. ఇది మన చివరి ఆశ. నీకు చావుబతుకుల సమస్య. కళ్ళు తెరవకపోయినా అంతా వినిపిస్తూనే ఉంటుందికనుక, సమయానుకూలంగా వొళ్ళు దగ్గరపెట్టుకొని ప్రవర్తించాలి తెలిసిందా? ఆ గొంతుకూడా, ఇంకా దీనంగా వుండాలి.

మధు:—ఒకవిధంగా బాధలోకూడా ఆనందం ఉందేమో ననిపిస్తోంది...నవ్వొస్తూంటే ఏంచేసేది?

దాసు:—అట్లాగేం? డాక్టర్!

డాక్ట:—సార్!

దాసు:—మీరలా వొంగి వొంగి సలాంలు చేయవోకండి స్వామీ! ఇది డాక్టర్ వేషంకాదయ్యా! డాక్టరే అనుకో!

అందులోనూ చావుబతుకులమీాద కొట్టుకునేవ్యక్తిని ఒక వొడ్డున పడేసేందుకు వొచ్చిన దేవతల్లేనే ప్రవర్తించాలి. ఇక్కడ వున్న వ్యక్తులందరిమీాదా తమకు ఎంతో అధికారం వుంది.

డాక్ట:—ఓ కే!

దాసు:—రోగి నవ్వినట్లయితే, లేదా ఏమాత్రం గాడి తప్పి ప్రవర్తించే సూచనలున్నా సరే, నేను తల వూపు తాను. వెంటనే ఇంజక్షన్ ఇవ్వాడవండి. సూది కండలోకి కసుక్కున దిగబడాలి. అంతగా వాస్తే తరువాత వేడినీళ్ళ కాపు వేసుకోవొచ్చు.

డాక్ట:—మంచిది......చాలా రోజుల్నుంచీ ఇంజక్షన్ చేయటం నేర్చుకుందా మనుకుంటున్నాను. చేయించుకునే వాళ్ళు దొరక్క వూరుకోవాల్సి వొస్తోంది...యీా సమయం లోనన్నా...

మధు:—నాకసలు ఇంజక్షనంటేనే భయం. అందులోనూ మన డాక్టర్ గారు చేస్తే సూది కండలో విరిగినా విరగ వొచ్చు. ఆ పనిమాత్రం చేయకండి బాబూ!

దాసు:—చెప్పినట్లు వినకపోతే ఆపరేషన్ కూడా జరుగు తుంది—ఖపడ్ దార్!

డాక్ట:—ఆపరేషన్ చేయాల్సివొస్తే నర్స్ లేదే!

దాసు:—కల్యాణీదేవినే నర్స్ గా ఉంచుదాం...రోగి కూడా త్వరగా కోలుకుంటాడు.

మధు:—ఏమిటీ ? యీ డాక్టర్ చేత ఆపరేషన్ చేయించుకున్నాక, ఇంకా కోలుకోవటమా ? సంజీవికూడా మరి బతికించ లేదు.

దాసు:—కనుక పిచ్చిపిచ్చి వేషాలు వేయక నీ పాత్రను జాగ్రత్తగా నిర్వహించుకో. చీకటి పడుతోంది. లైటు వేసి వుంచుదాం...

[స్విచ్ నొక్కి లైటు వేస్తాడు]

మధు:—వాళ్ళు ఇంకా రారేం ?

దాసు:—వొస్తారయ్యా ! ఫోన్ చేశాను. పద్మ అందుకుంది; పక్కనే కల్యాణికూడా వుంది. మాట్లాడేందుకే ఆమె కంపించింది. నీవు మాట్లాడకుండా పడుకోరా బాబూ !

[బైట కారు బ్రేకులుపడి, బరువుగా ఆగిన శబ్దం]

దాసు:—ఆమె టాక్సీమీద వొచ్చినట్లుంది—రోగి మొహం మీద చెమట కనిపించేందుకు కాసినినీళ్ళు కొట్టవయ్యా డాక్టరూ !

[బేసిన్ లోని నీళ్ళు కాసిని మధు మొహంమీద కొట్టాడు. మధు గోడ వైపు తిరిగి పడుకున్నాడు. డాక్టర్ సీరియస్ గా రోగిని పరీక్షించటంలో నిమగ్నుడయ్యాడు. ఆతృతను నటిస్తూ దాసు డాక్టర్ పక్కనే నిలబడి వున్నాడు.

కల్యాణి పరుగెత్తుకుంటూ వొచ్చింది. ఆమె ముఖంలో విషాదం స్పష్టంగా కనిపిస్తోంది. మనిషి ఎంతో హైరానైవుంది. ఆ తొందర్లో ఆమె వొంటిమీద నగలు తీసెయ్యటంకూడా మరిచిపోయింది; ఇప్పుడు ఆమెను చూడగానే కలయింటి బిడ్డని తోచకపోదు. ఏడవడం ఒక్కటే తక్కువగా వుంది]

కల్యా:—(కంపిత స్వరంతో) ఏమండీ ?

[డాక్టర్ 'ఇస్'అని మాట్లాడవొద్దని సైగ చేశాడు. కల్యాణి విచారంగా దాసువైపు చూస్తుంది. దాసు రోగి మంచందగ్గర్నుంచి కల్యాణి దగ్గరకు వొస్తాడు]

కల్యా:—(తగ్గుస్థాయిలో) ఎట్లావుందండీ ?

దాసు:—మహాసాగరంలో వున్నాం...ఇంకా ప్రాణం పోలేదు...బాధతో కొట్టుకుంటున్నాడేమో ? ఇంతకుముందు తెలివి వొచ్చింది కాని...

[కల్యాణి షాక్ తగిలినట్లుగా అదిరిపడింది. ఆపుకోలేని దుఃఖం సన్నగా బైటపడుతోంది]

డాక్ట:—(చేయి పైకెత్తి) నిశ్శబ్దం !

[డాక్టర్ ఆలోచిస్తూ ముందుకు వొచ్చాడు]

డాక్ట:—ఎవరీమె ?

దాసు:—యీమెను గూర్చేనండీ—మనవాడు సైనైడ్ మింగింది !

డాక్ట:—(కల్యాణిని తేరిపార చూసి) ఐసీ ! ప్రణయంతో ప్రాణానికి తెచ్చుకున్నాడు. సౌందర్యం మేలుకన్న హానే ఎక్కువగా చేస్తుంది !

కల్యా:—నేనిలా అవుతుందని అనుకోలేదు డాక్టర్ గారూ ! నాకు కనీసం సూచనప్రాయంగా తెలిసినా యీ దుస్సంఘటన జరిగేది కాదు......దుష్టురాల్ని ! చేజేతులా జీవితాన్ని నేలపాలు చేసుకున్నాను...ఎంత ఖరీదైన చికిత్సయినా ఫర్వాలేదు...ఎలాగైనా బతికించండి; జన్మంతా మీకు కృతజ్ఞురాలుగా వుంటాను.

డాక్టరు:— ఏం చేయమంటావమ్మా! ఎలాగైనా బతికిద్దామనే విశ్వ ప్రయత్నం చేస్తున్నాను. ఇంతకుముందు తెలివిలోకి వొచ్చాడు మందు తాగమని ఎంత బతిమాలినా వినలేదు. చివరకు బలవంతంగా మందుపోసి సగం కక్కించాను. అంతమాత్రంచేత ప్రమాదావస్థను దాటామని చెప్పలేను. మందు తాగుతేకాని ఆశలులేవు—

దాసు:—(అందుకొని) పైగా మా అందర్నీ ఒకేతిట్లు, తనను చావనీయకుండా అడ్డంపడుతున్నామని దుమ్మెత్తిపోశాడు. శక్తిలేదుకాని లేకుంటే మా ఇద్దర్నీ మేడమీంచి విసిరి పారేసేవాడు.

డాక్ట:—ఒక్కటే ఆశ మిగిలివుంది.

కల్యా:—చెప్పండి...త్వరగా.

డాక్ట:—అదేం మందుకాదు...నన్ను స్వేచ్ఛగా చికిత్స చేయనివ్వటం...ఏదో భరించరాని నిరాశలోపడి రోగి మనస్తత్వం పూర్తిగా చెడింది. బతకాలని ప్రయత్నించేవాడికి చికిత్స ఉపకరిస్తుందికాని, చచ్చేందుకే పనుగులాడేవాడికి అమృతంకూడా అక్కరకురాదు...ఏదో ఉపాయంగా రోగి మనస్సును జీవించాలనే ఆశలమీదికి మళ్ళించాలి.

కల్యా:—ఏం చెయ్యాలంటారూ?

డాక్ట:—ఆప్తులైనవాళ్ళు అతని మనసులో కొత్త ఆశల్ని రేకత్తించాలి.

[కల్యాణికి అర్థంగాక దాసువైపు చూస్తుంది]

దాసు:—ప్రాణమిత్రుణ్ణి. అంతరంగిక కార్యదర్శినీ నేను ఇందాకటినుంచీ ఎంత బతిమాలినా వినలేదు...విషాద జీవితం!...విఫల ప్రణయం!...కల్యాణీ!...అని ఒకటే కలవరింతలు!

కల్యా:—కబురు అందగానే క్షణంకూడా ఆలస్యం చేయకుండా పరుగెత్తుకొచ్చానండీ!

దాసు:—జరిగిపోయిన సంగతులు ఇప్పుడెందుకులెండి!...రోగికి ఆశలు కల్పించాలి.

కల్యా:—మీరు ఏం చేయమంటే అది చేస్తానండీ! ఆయన బతుకుతే అదే నాకు పదివేలు.

డాక్ట:—ఏంలేదు. మీవల్లనే ఆయన ప్రాణంమీదికి తెచ్చుకున్నాడుకదా! మిమ్మల్ని ఎంత గాఢంగా ప్రేమించి వుంటాడో మీకు అర్థమవకపోదు. తన ప్రాణంకన్న అధికంగా ప్రేమిస్తున్నాడు కనుకనే, ప్రాణాన్ని తృణప్రాయంగా వొదిలేందుకు సిద్ధపడ్డాడు. మీరు కల్పించిన నిరాశే అతనియీ సాహసానికి దారితీసింది. మీరు అతన్ని ప్రేమిస్తున్నారో లేదో, ప్రేమించినా అతనంత గాఢంగానూ ప్రేమిస్తున్నారో లేదో నాకు తెలియదు. ఏమైనా నేను కోరేదేమంటే, మానవుడిపట్ల తోటి మానవుడు చూపవలసిన జాలి, సానుభూతి, మీకు ఇష్టంవున్నా లేకున్నాసరే, అతని

ప్రియురాలివలె నటించండి. తనకుకూడా ఆప్తురాలు, అందులోనూ తాను గాఢంగా ప్రేమించిన స్త్రీ తనకు అండగా వున్నదనే నమ్మకం అతనికి కలిగించండి. మీకోసమే అతన్ని బతికించుకుంటున్నట్లుగా తెలియచెప్పండి. ఎండి మోడైన అతని ఆశల్ని తిరిగి చిగిరింపచేయండి. ఆ గుడ్డినమ్మకంలో అతను తిరిగి బతికేందుకు ప్రయత్నిస్తాడు; అతని మనస్తత్వం మారుతే, మిగతా విషయాలు నేను చూసుకుంటాను. ఏదెలావున్నా మీరొక మానవుడికి ప్రాణదానం చేసినవాళ్ళవుతారు. నటన!...అంతే...ఆ తరువాత ఇదంతా నటన అని అతనికి తెలిసినా ప్రమాదంలేదు; ఎందుకంటే ఏదో క్షణిక బలహీనతకు లోనై అతను ఆత్మహత్యకు పూనుకున్నాడు. కేవలం యీ నటననే తాను నమ్మి ఎంత మూర్ఖుడైనాడో అర్థమవుతుంది. అప్పుడు మనమందరం ఎంత గట్టిగా ప్రయత్నించినా అతనిచేత ఇలాంటి అఘాయిత్యం చేయించలేము...కావలసిందల్లా నటన: అంతే...నటన!

కల్యా:—(దుఃఖం పొంగిపొరిలే కంఠంతో) నటనా యీస్థితిలో నేను నటించగలనా? డాక్టర్‌గారూ! నటన్కే ఖర్మమండీ! నేను నిజంగానే ఆయన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను; ఆయన నన్నెంత గాఢంగా ప్రేమిస్తున్నాడో, నేను ఆయన్ను అంత గాఢంగానూ ప్రేమిస్తున్నాను. యీసారి ఆయనకు తెలివిరాగానే ఆయన పాదాల మీద పడతాను...ఆయన ప్రియురాలివలెకాదు...ధర్మపత్నివలె!

[దాసు, డాక్టరూ తృప్తికరంగా ఒకరి వంక వొకరు చూసుకుంటారు]

డాక్ట:—అట్లాగైతే మరీ మంచిది. మీరు ఆమాత్రం సహాయంచేస్తే చాలు. నాడిమాత్రం చాలా నీరసంగావుంది. మింగింది సైనైడ్ ఐనా చాలా మైల్డ్ డోస్ ఐవుంటుంది. అందుకనే రక్తం విషమయమయ్యేందుకు వ్యవధివుంటుంది...

[మధు కొంత కదిలాడు. కల్యాణి అతని దగ్గరకు పరుగెత్తబోయింది. డాక్టర్ చేతితో సైగచేసి ఆమెను ఆపాడు]

డాక్ట:—(రహస్యంగా) ప్రణయసంభాషణలు జాగర్త. మీకేమన్నా సిగ్గుగావుంటే మేం అవతలికి వెళ్తాం.

కల్యా:—నాకు అలాంటి సిగ్గులులేవు. ఇన్నాళ్ళూ సిగ్గుపడుతూ, గర్వాన్ని ప్రకటించుకునేందుకుగాను పొరపాటు చేశాను. హృదయవేదనను వ్యక్తీకరించటం తప్పుకాదుగా! కనుక తిరిగి అలాంటి పొరపాట్లనుమాత్రం చేయను.

డాక్ట:—సరేఐతే...ఆపక్కన సీసాలోవున్న మందు తాగించండి.

[కల్యాణి తలవూపి, రోగి మంచందగ్గరకు వెళ్లి పక్కనేవున్న కుర్చీలో కూర్చుంది. మధు ఆమెవైపు తిరిగి, బాధతో మూలుగుతూ మళ్ళీ మామూలుగా గోడవైపు తిరగబొయ్యాడు. కల్యాణి సున్నితంగా అతన్ని తాకి, తనవైపు తిప్పుకుంది]

కల్యా:—(బలవంతాన దుఃఖాన్ని ఆపుకుంటూ) మధుకుమార్!

[మధులో చలనంలేదు]

దాసు:—(దగ్గరకు వెళ్ళి మధును కదుపుతూ) మధూ! కల్యాణి వొచ్చింది. చూడు...కల్యాణీదేవి...

మధు:—(నీరసంగా) దా...హం!

డాక్ట:—మంచినీళ్ళివ్వండి.

[దాసు గ్లాసుతో నీళ్ళు అందించాడు. కల్యాణి గ్లాసును అందుకొని. మధు తలను తన చేతిమీదకు లాక్కొని, నోటికి గ్లాసు అందిస్తుంది. మధు గ్లాసు తోసేస్తాడు. నీళ్ళుచిందిపడుతవి]

మధు:—ఫోండి...నన్ను చావనీయండి!

కల్యా:—మధుకుమార్!...ముందు మంచినీళ్ళు తాగండి!

మధు:—ఎవరూ?

దాసు:—కల్యాణీదేవి వొచ్చారు మధూ!

మధు:—అబద్ధం! ఫోండి...మీరంతాకలిసి నన్ను బతికించాలని చూస్తున్నారు...నాకు యీ లోకంలో ఎవరూ లేరు...నేను ఎవ్వరికీ ఏమీకాను...ఫోండి.

కల్యా:—(కన్నీళ్ళతో) మధూ! నేనువున్నాను, ఒక్కసారి కళ్ళు తెరవండి...నేను వొచ్చాను...నీకోసంకాదు...నాకోసం...నిన్ను బతికించుకునేందుకు—

మధు:—ఆఁ...ఎవరూ?...ఇది స్వర్గమా?

దాసు:—చచ్చి స్వర్గానికి జేరాననుకుంటున్నాడు. ఆత్మహత్య చేసుకున్నవాళ్ళు స్వర్గానికి వెళ్తారని నేనెక్కడా వినలేదు! ఏమంటారు డాక్టర్‌గారూ?

డాక్ట:—ఏమో—నాకు తెలియదు.

కల్యా:—మధుకుమార్ ! నేను కల్యాణి...నీవు బతుకు అదేచాలు...అప్పుడు మనిద్దరం యీ భూమిని స్వర్గం చేసు కోగలం.

మధు:—(పిచ్చిగా నవ్వి) చచ్చాక బతకటం ఎలా?

డాక్ట:—చావలేదు నాయనా! ఇంకా ఆశలువున్నయ్. సరిగ్గా చావుబతుకుల సరిహద్దుల్లో వున్నావ్! ఒక అడుగు వెనక్కు పడిందా—నీ జీవితం స్వర్గమే అవుతుంది; ఒక్క డుగు అవతలపడిందా మనకు ఎవ్వరికీ తెలియని అంధ కారంలో పడిపోతావు. అప్పుడు పశ్చాత్తాపపడినా లాభం లేదు.

కల్యా:—ఒక్కసారి కళ్ళు తెరిచిచూడు. యీ భూమి, యీ సౌఖ్యాలు, యీ ఆప్తులు, యీ స్నేహితులు—వీరం దర్నీ వొదలగలవా? పాషాణ సమానంగావున్న మీ హృద యాన్ని మార్చుకోండి. మీరు సుఖపడి, ఇతర్లను సుఖ పెట్టండి.

మధు:—ఒద్దు...నన్ను బతికించటం వృధా! నేను బాధలుపడుతూ, ఇతర్లను బాధలుపెడతాను...నేనెందుకూ పనికిరాను—

కల్యా:—ఎవరన్నారు? మీకుమీరుగా గోరంతలు కొండంతలు చేసుకుంటున్నారు. ఈ ప్రపంచమే మిమ్మ్ని విసర్జించుగాక—కాని మీరే నాకు యావత్ ప్రపంచంలో

సమానం. మధుకుమార్! ముందు యీ మంచినీళ్ళు తాగండి.

[మధు మెల్లిగా కళ్ళు తెరుస్తాడు.]

మధు:—(ఆశ్చర్యంతో) ఎవరూ?...కల్యాణీదేవి!

కల్యా:—ఔను...మీకోసమే వొచ్చాను.

మధు:—ఎందుకూ? నేనింకా చావలేదనా?

కల్యా:—నామీద మీకెందుకంతి కోపం?

మధు:—ఔను...మీమీద కోపం దేనికి? మీరెవరు? నేనెవరు? కొద్దిరోజులు పరిచయం ఉన్నంతమాత్రాన ఆత్మీయత వొచ్చిపడుతుందా? పరాయి స్త్రీవి, అందులోను కొద్దిరోజుల్లో పత్నిత్వాన్ని స్వీకరించపొయ్యేదానిమీద నాకు కోపంరావటం హాస్యాస్పదం!

కల్యా:—అదంతా అబద్ధం...సావకాశంగా మీకు అర్థమయేట్లు చెపుతాను. ఒకటి నిజం. నేను నీదాన్ని... నమ్మవా? ఏంచేయుమన్నా చేస్తాను.

మధు:—నాకోసమై ఏంచేసినా కాముకునేదేమిటి?

కల్యా:—కాదు—నాకోసమే నిన్ను బతికించుకుంటాను. మృత్యువుకూడా విడదియ్యలేని సంబంధాన్ని కోరే నా హృదయాన్ని ఎలా విడమరిచేది?

మధు:—ఈ ఎండమావుల్ని చూసి భ్రమించి మోసపోయి విసిగిపొయ్యాను.

కల్యా:—నేను ఎంత నీచురాల్ని! మీ హృదయంలో ఎలాటి గాయాన్ని చేశానో ఊహించలేకపోయ్యాను. నా అనుభవశూన్యతే యీ పరిస్థితికి కారణమైంది. నా మూర్ఖతకు ఎంత విలువ చెల్లించాల్సివొచ్చింది? మనసారా ప్రేమించిన వ్యక్తి ప్రాణానికి తక్కువకాని వెల! ఏంచేయను?

[ఎలాగైనా అదే ధోరణిని పొడిగించమని డాక్టర్ సౌంజ్ఞ చేస్తాడు]

కల్యా:—మధుకుమార్! నేను మీకు హాని చేసే వుండొచ్చు; అందుకు మీరు నన్ను క్షమించకపోయినా ఫర్వాలేదు. కాని నామీద పగ సాధించేందుకు ఇది సమయం కాదు...ముందు ప్రమాదవస్థను దాటనీండి. ఆ తరువాత మీరు నన్ను ఏవిధంగా సాధించినా నాకు ఇష్టమే!

మధు:—ఒద్దు......నన్ను మళ్ళీ యీ పాపభూయిష్ట ప్రపంచంలోకి, యీ బాధల్లోకి లాగవొద్దు. నా మాట విని మీరు వెళ్ళిపొండి...కల్యాణీదేవీ! కన్యలు ఇలా పరాయి మొగాడిదగ్గరకు రావటాన్ని సమాజం ఏమాత్రం సహించదు అందులోనూ పైవారంలో పెళ్ళి చేసుకోబోతున్నారు... నాలోని కళంకం మీకు అంటుకుంటే అదేచాలు. నిర్భాగ్యుణ్ణి బాగుచేసేవారూ, అదృష్టవంతుణ్ణి చెరిచేవారూ లేరుగా!

కల్యా:—నన్ను మాటల్తో బాధపెట్టటం మీకు ఆనందమేఐతే, ఆ బాధను నేను సంతోషంగా భరిస్తాను. కాని మీరు అనవసరంగా ప్రాణాలుతీసుకుని సాధించగలిగే దేమిటి?

మధు:—సాధించలేని అసమర్థుణ్ణి కనుకనే, ఓటమిని అంగీకరిస్తూ ఆత్మహత్య చేసుకుంటున్నాను. ఇదివరకల్లా చావలేక బతికాను ఇప్పుడు బతకలేక ఛస్తున్నాను—అంతే తేడా !

కల్యా:—(కోపంతో) మొండితనానికూడా అంతుం డాలి! సరే...విషంతాగి ప్రాణం తీసుకుని నామీద పగ సాధిస్తారు అంతేనా?... నేనుమాత్రం తక్కువతిన్నానా? మీరు చూపినదారి ఉండనేవుంది. నేనుకూడా విషంతాగి ప్రాణంతీసుకుంటే అప్పుడు మీ ఆత్మకన్నా శాంతివుంటుంది.

[డాక్టరూ, దాసూ ఒకళ్ళ మొహాలు ఒకళ్లు చూసుకుంటారు]

దాసు:—(రహస్యంగా) తొండ ముదిరి ఊసరవిల్లి అయింది.

డాక్ట:—కథ క్లయిమాక్స్‌లో పడింది. ఇక దిగిరావటం ధర్మం—

దాసు:—అరవవోక...

[ధోరణి మార్చమని దాసు, మధుకు సైగచేస్తాడు]

మధు:—(అదిరి) మీకు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం ఏమిటి? అందులోనూ పెళ్ళికాబోతున్న—

కల్యా:—పెళ్ళి! నాకు ఆ యోగ్యతేవుంటే మీరు యీ పని చేసేవాళ్ళా? ఐనదేమో ఐంది; మిగిలిన ఆశల్నికూడా నేలపాలుచేస్తూ, ఎంత బతిమాలినా, భంగపడినా వినకుండా ఇంత కఠినంగా ప్రవర్తించేవాళ్ళా?...సరే—చూడండి;

నా యీ చివరిప్రార్థనను ఆలకించండి...ముందు ఈ నీళ్ళు తాగండి మందు తాగండి. ఆ తరువాత తీరిగ్గా మాట్లాడు కుందాం. ఒకళ్ళను ఒకళ్ళు అర్థంచేసుకుంటే అదేచాలు... తాగరూ ? నాకోసం—?

మధు:—ఇది కలకాదుకదా ?

కల్యా:—కాదు—రక్తమాంసాలతో మీా దగ్గరవున్న నన్ను తాకండి. స్వాప్నికి జగత్తునుంచి మేలుకోండి. జీవితాన్ని తృణీకరించకండి.

[కల్యాణి అందించిన నీళ్లు తాగాడు. వెంటనే డాక్టర్ మందు అందించాడు. కల్యాణి నోటికి అందించిన మందుకూడా తాగాడు. దగ్గు తెర వొచ్చింది. కల్యాణి తన పమిట చెరగుతో మధుకుమార్ ముఖం తుడిచింది. మధు సుఖంగా పడుకున్నాడు]

కల్యా:—కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. బతికివుంటే లోకాన్నే తలక్రిందులు చేయవొచ్చు.

[మధు మాట్లాడకుండా పడుకున్నాడు. కల్యాణి డాక్టర్ను రమ్మని సైగచేసింది. డాక్టర్ వొచ్చి రోగిని పరీక్షించాడు; ఆ తరువాత డాక్టర్ ముందుభాగంలోకి రాగానే కల్యాణి, దానూ ఆయన్ను చుట్టుముట్టారు]

డాక్ట:—గండం దాదాపు గడిచింది. నాడీ, గుండా బాగున్నయ్.. ఇప్పుడిచ్చినదాంతో గంటా గంటన్నరకల్లా ఆవిషం కక్కేస్తాడు. అదయ్యాక పాలనా, కాఫీ అనా ఇవ్వండి. రెండురోజులపాటు కొంప టేచర్ ఉండొచ్చు; అదేమంత ప్రమాదంకాదు—

కల్యా:—మీరు వెళ్తారాయేం? అదేంవల్లకాదు.

డాక్ట:—ఉండాలో అక్కర్లేదో నాకు తెలియదూ? ఐనా నాకన్న పెద్ద డాక్టర్లు మీరుండగా నేను అనవసరం.

కల్యా:—ఏమో-నాకు భయంగావుంది. మీరు ఉండాల్సిందే!

డాక్ట:—(నవ్వి) గాభరా ఏమీలేదు. ఐనా మా ఇల్లు చాలా దగ్గర. అంత అవసరమైతే ఏక్షణాన పిలిచినా వస్తాను...మీరు ఇచ్చిన చికిత్స అమోఘం. అమృతమే పోసి రోగిని బతికించారనుకోండి......ఈసారి చావమన్నా చావడు...మీలాంటి సౌందర్యవతికోసం చచ్చినవాళ్ళయినా సరే బతికిరాగలరు!

[సిగ్గుతో కల్యాణి ముఖం ఎర్రబారింది]

ఐనా ఇంతటితో వొదలవోకండి. ఇందాకటి ధోరణిలోనే తియ్య తియ్యని మాటల్ని ఆయనకు వినిపించండి. అదే సంజీవిలాంటి మందు!...మరి సెలవా?

[సంచీ సర్దుకొని డాక్టర్ వెళ్తాడు]

కల్యా:—(కన్నీళ్ళు తుడుచుకొని నిట్టూర్చి) ఏమండీ—పెద్దలు మీరుండగా యిలా జరగనిచ్చారే?

దాసు:—ఏంచేయమంటారు? బతుకంటే రోతపుట్టినట్లు సూచిస్తూవొచ్చాడేకాని, ఇంత అఘాయిత్యం చేస్తాడని ఎవరనుకున్నారు? వాడి మానసిక స్థితి రోజురోజుకూ దిగజారుతూవుందనే సంగతి పద్మావతికి చెపుతూనేవొచ్చాను. రెండు

మూడు సార్లు బతకటం అనవసరమన్నాడు: ఆ సంగతి కూడా పద్మావతికి చెప్పాను; అప్పుడైనా మీరు వొచ్చి వుండాల్సింది.

కల్యా:—పొరపాటయిందండీ — ఇలా జరుగుతుందని నేనూ అనుకోలేదు.

దాసు:—అదివరకు నేను ఎన్నో ఆశలు కల్పిస్తూవుండే వాణ్ణి. తాత్కాలికంగా ఒకళ్ళనొకళ్ళు అపార్థంచేసుకున్నా క్రమంగా ఆ మేఘాలు విడిపోతయ్ లెమ్మని సర్ది చెపుతూండే వాణ్ణి. అందుకనే క్షమాపణలు కోరుకుంటూ మీకు ఉత్తరం కూడా రాయించాను.

కల్యా:—నేను మూర్ఖురాల్నే అనుకోండి. ఆ కోపంలో నేను ఇవన్నీ లెక్కచేయలేదు. కాని ఆయన అనాలో చితంగా—

దాసు:—అలాకాదు. చూడండి: మొదట్లో మధు కూడా ఆశల్ని పూర్తిగా చంపుకోలేదు. కాని తీరా మీరు బ్రహ్మంతో వివాహాన్ని నిశ్చయించుకున్నారని తెలిశాక, మధుకు నిరాశతప్ప ఇంకేం వుంటుంది ?

కల్యా:—అదంతా అబద్ధమండీ! నేను ఆత్మహత్యయినా చేసుకుంటానుకాని, బ్రహ్మాన్ని వివాహమాడేటంత బుద్ధి హీనురాల్నికాదు. పద్మచేత అలా చెప్పిస్తే మధుకుమార్ తొందరపడి ఇంకా దగ్గరవుతాడని అలాచేశాను.

దాసు:—(ఆశ్చర్యంగా) నిజం ?

కల్యా:—నిజమండీ! ఆ భ్రమన్ని చూస్తేనన్నా మీకు అర్థమవకపోదు. అసలు మొదటినుంచీ కొంత కొంత నిజాన్ని మీదగ్గర దాస్తూవొచ్చాం.

దాసు:—ఏమిటీ—అలాగా ?

కల్యా:—మిమ్మల్ని నమ్మించినట్లు నేను బీదదాన్ని కాదు. చాలా భాగ్యవంతుల పిల్లను రావుబహద్దూర్ వెంకట్రామయ్యగారు మా నాన్న !

దాసు:—(ఆశ్చర్యంగా) ఏమిటీ ? నిజంగా ? వెంకట్రామయ్యగారి అమ్మాయివా ? మీ నాయన నాకు చాలా కావాల్సినవాడు. మరి ఇంత నాటకం ఎందుకు ఆడాల్సి వొచ్చిందీ ?

కల్యా:—చూడండి : నన్ను పెళ్ళాడాలని చాలామంది వొచ్చారు.

దాసు:—అది సహజమే! నీ అందచందాలకు చలించని—

కల్యా:—అది నాకు నమ్మకంలేదు. నన్ను చేసుకుంటే బోలెడు ఆస్తివొస్తుందని వాళ్ళ ఆశ !

దాసు:—మరి మీ నాయన నీ పెళ్ళి విషయంలో ఏమీ కల్పించుకోరూ ?

కల్యా:—తల్లి లేని పిల్లనని ఎంతో గారాబంగా పెంచారు. నాకు ఎంతో స్వేచ్ఛ! పెళ్ళి విషయంలో ఇక చెప్పక్కర్లేదు. వరుణ్ణి కోరుకోవటం నా వొంతు—

దాసు:—అందుకని అనాథవల్లే నటించావన్నమాట ?

కల్యా:—అప్పుడు నా వ్యక్తిత్వపు విలువే నిలబడుతుంది కదండీ ?

దాసు:—మాంఛి తెలివైన ఎత్తువేశావమ్మా! మరి యీ బ్రహ్మం ఎవరూ? మనవాణ్ణి ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించి, ప్రాణగండంలోకి లాగాడు!

కల్యా:—ఉన్నాడులెండి... మేనమామ కొడుకు! వొట్టి మూర్ఖుడు. ఇక్కడికి జేరుతే నన్ను పెళ్ళాడే అవకాశాలు ఎక్కువ అవుతయ్యని మేనత్త అతన్ని మా ఇంట్లోనే వుంచి చదివిస్తోంది. అతనంటే నాకు పరమ అసహ్యం!

దాసు:—అట్లాగా ? మరి మీ నాయనకు ఇష్టమేమో ?

కల్యా:—ఎబ్బే! అతనంటే మా నాయనకూ వెగటే! పరమానందయ్య శిష్యుడే అనుకోండి! ఏదో చదువుకుంటు న్నాడనే నాన్నగారు అతన్ని వెళ్ళగొట్టలేదు కాని—

[మధు కాస్త కదిలాడు, కల్యాణి అతని దగ్గరకు వెళ్ళేందుకు లేచింది]

దాసు:—అతన్ని మరి కాస్సేపు విశ్రాంతి తీసుకోనీ వమ్మా!

[కళ్యాణి కూర్చుంది]

కల్యా:—కాని మీరు దూరం ఆలోచిస్తే తప్పంతా నాది కాదండీ!

దాసు:—అంటే ?

కల్యా:—చూడండి! మధుకుమార్ ఎంతకూ పెళ్ళి ప్రస్తావన తేవటంలేదని బ్రహ్మన్ని ప్రవేశపెట్టాననుకోండి.

కేవలం బ్రహ్మాంమీాది ద్వేషంతో మధుకుమార్ దగ్గరకు వొస్తాడని ఆశపడ్డాం...పోనీ మధుకుమార్ చేసినపని బాగుందా ?

దాసు:— ఏం చేశాడూ ?

కల్యా:—అంతరంగిక కార్యదర్శిగా మీాకంతా తెలిసి వుండికూడా, నాచేత చెప్పించాలని చూస్తున్నారు...ఆనాడు ఎవతెనో లోపల పెట్టుకొని...

దాసు:—(నవ్వి) అదా ? మావాడిదగ్గర మీారు నాటకం ఆడినట్లే, మావాడుకూడా మీాదగ్గిర ఒక చిన్న నాటకం ఆడాడు.

కల్యా:—అంటే ?

దాసు:—ఏంలేదు...ఎన్నాళ్ళకూ మీారు పెళ్ళిప్రస్తావన తేవటంలేదని, మీాలో కొంత తొందరనూ, వేడినీ కలిగించేందుకని ఆపని చేశాడు. ఆ యీార్ష్యతో మీారు జాగ్రత్త పడి దగ్గరవుతారనే ఆశతో ఎవతెతోనో సరససల్లాపాలు ఆడుతూన్నట్లు నటించాడు—అంతే !

కల్యా:—అదంతా నటనా ? నేనెంత బాధపడ్డాననీ ! ఐనా మొగాడు—ఆయన ముందడుగు వేయకపోవటం నా తప్పా ? అంతరంగిక కార్యదర్శిగా వున్న మీారన్నా చెప్ప లేకపొయ్యారా ?

దాసు:—చెప్పేవాణ్ణే ! కాని మీా రెంతో కఠినహృదయులనీ, పురుష ద్వేషులనీ పద్మనమ్మకంగా చెప్పింది. అందుకని మధుకు వాళ్ళు కాస్త దగ్గరుంచుకోమని సలహా ఇచ్చాను.

కల్యా:—మధుకుమార్ చాలా కఠిన హృదయులనీ, నారీద్వేషులనీ మీరు పద్మతో చెప్పబట్టే నేను ఎంతకూ దూరంగానే వుంటూవొచ్చాను.

దాసు:—బాగానేవుంది. ఒకళ్ళనొకళ్ళు దూరాన వుంచారన్నమాట! నిజాన్ని దాచినందువల్ల ఎంత డొంకతిరుగుడయిందో చూశావా?

కల్యా:—నాకోసం ఆత్మహత్య చేసుకునేటంత గాఢంగా నన్ను ప్రేమించాడంటే నాకు ఆశ్చర్యమైంది. అలాటి ప్రేమ భూలోకంలో వుంటుందని నేను యెన్నడూ ఊహించ లేదు.

దాసు:—కాదామరి?......సావిత్రీ దేవల్లే యముణ్ణి వెంటాడి భర్త ప్రాణాల్ని తిరిగి సంపాయించుకున్నావ్—

మధు:—(కాస్త కదిలి) అబ్బ!

దాసు:—వెళ్ళమ్మా! వెళ్ళి మరి కాస్త సంజీవి చల్లు.

[కల్యాణి వెళ్ళి మధు ఫాలభాగాన్ని సున్నితంగా తాకింది]

కల్యా:—ఎలావుందండీ?

మధు:—(మూలిగి) బతికినట్లే అనుకుంటాను...కడుపులో తిప్పుతోంది—

కల్యా:—తగ్గిపోతుంది లెండి. మొహంగూడా తేటగా వుంది, చూడండి—నావొంక చూడరూ?

[మధు కళ్ళు తెరిచి ఆమెవంక చూశాడు]

మధు:—ఇందాకటినుంచీ ఇదంతా కలేమో, కళ్ళు తెరుస్తే ఇదంతా మాయమౌతుందేమోనని భయపడుతున్నాను.

కల్యా: —క లేమిటండీ ? గంటసేపట్నుంచీ మీకోసం నేనిక్కడ పడివుంటే ?

మధు:—ఏమిటీ-ఇందాక బతిమాలింది నీవేనా ?

కల్యా:—నేనేనండీ-

మధు:—ఊహుఁ. అలాగే అనుకున్నాను...కాని వెళ్ళి పోయి ఉంటావనికూడా అనుకున్నాను.

కల్యా:—ఎక్కడికి వెళ్తానూ ? మిమ్మొదిలి వెళ్ళమంటారా ? అలా మీరు అనగలిగినా, నేను మాత్రం వెళ్ళలేను. నేను వెళ్తే మరెవతన్నా మిమ్మల్ని వలలో వేసుకో గలదు !

మధు:—అదా ? అదంతా నటన...మరేం అనుకోకు.

కల్యా:—(మాతి ముడిచి) అంతేలెండి—ఏంచేసినా మొగాళ్ళకే చెల్లుతుంది.

మధు:—పోనీ నా తప్పును క్షమించగల విశాలహృదయం నీ దగ్గర వుండనుకుంటాను ?

కల్యా:—ఛా ! ఏం మాటలండీ ? అందుతే జుట్టూ లేకుంటే కాళ్ళూనా ?

దాసు:—అట్లా బుద్ధి చెప్పమ్మా ! మెత్తని చెప్పుతో—

మధు:—ఆయన మాటలు వినే ప్రాణంమీదికి తెచ్చుకున్నాను...ఇప్పుడు అవన్నీ ఎందుకు కాని...పై వారంలో నీ పెళ్ళటగా ?

కల్యా:—ఔను......పెళ్ళవకముందే అత్తవారింటికి వొచ్చేశానని ఎగతాళి చేస్తారు కాబోలు :

మధు:—నిజమేనా ?

కల్యా:—నాకోసం కాకపోతే మీరు బతికేవాళ్ళా ?

[కారు బరువుగా ఆగిన చప్పుడు; మెట్లమీద తొందర తొందరగా నడిచివొస్తున్న చప్పుడు]

దాసు:—ఆత్మహత్యానేరం జరిగిందని పోలీసులు రావటం లేదుకదా !

మధు:—ఆత్మహత్య ఎక్కడోయ్ ? విషంతాగినట్లు నటించానేకాని, విషంతాగానని రుజూ చేయటం ఎవడబ్బ తరమంట ?

కల్యా:—(తత్తరపాటుతో) ఏమిటీ—ఇదీ నాటకమే ?

[మధు తొందరపడ్డందుకు నాలిక కొరుక్కున్నాడు. కల్యాణి దాసు వైపు చూస్తే, దాసు మొహం తప్పించాడు...వెంకట్రామయ్యా, పద్మా వొచ్చారు. వెంకట్రామయ్య గంభీరమైన మనిషి; వెంట్రుకలు నెరిసినా బలిష్ఠమైన శరీరం. వయస్సు యాభైదాకా ఉంటవి. దుస్తులతీరునుబట్టే ఐశ్వర్యవంతుడని చెప్పవొచ్చు...వాళ్ళిద్దరి వెనుకా, బ్రహ్మం వొణుకుపుతుంటూ మెల్లిగా ప్రవేశించాడు]

వెంక:—ఎవరూ?...దాసా ?

దాసు:—ఔను భాయీ! నేనే...మనం కలుసుకొని చాలా కాలమైంది.

వెంక:—కల్యాణీ! ఏమిటిది ?

(దాసుతో) ఎవరో అమ్మాయికోసమని ఆత్మహత్య చేసుకున్నారంటే పరుగెత్తుకుంటూ వొచ్చాను.

బ్రహ్మం:—చచ్చాడా ? లేదా ?

మధు:—ఎవడ్రా అది ?

కల్యా:—ఆయనే...నీ పోటీదారుడు !

దాసు:—అయ్యగారు యమలోకం పొలిమేళ్ళదాకా వెళ్ళటం, మీ అమ్మాయి యముని వెంటబడి ఆయన ప్రాణాన్ని తిరిగి తెచ్చుకోవటం జరిగింది. ఇందాకటినుంచీ ఇదే నాటకం ! అదుగో సావిత్రీ సత్యవంతులు !

వెంక:—కల్యాణీ !

కల్యా:—ఆఁ.

[మధును గిల్లుతుంది. మధు లేచి వెంకట్రామయ్యకు నమస్కరిస్తాడు]

వెంక:—ఈయనేనా ప్రాణాలు తీసుకునేందుకు ప్రయత్నించింది ?

కల్యా:—ఔను.

వెంక:—నయం ! చావలేదింకా !

(దాసుతో) ఛస్తే అమ్మాయి ఒక తాజ్ మహాల్ లాంటిది కట్టించేది సుమండీ !

దాసు:—కళకు ఎంత అపచారం జరిగిందే!

బ్రహ్మం:—కల్యాణీ ! ఇంటికి పోదాం రా—

కల్యా:—నేను రాను—నీవు పో !

పద్మ:—అత్తవారిల్లు ఇప్పట్నుంచే చక్కబెడుతుంది !

[కల్యాణి పద్మ వైపు ఉరిమిచూస్తుంది]

వెంక:—ఈ ఆడపిల్లల్లో చెడ్డగొడవండీ !

దాసు:—గొడవేముందిలెండి ! మీరేమీ శ్రమపడకుండా నే తగిన అల్లుణ్ణి వెతుక్కుంది. మీ సహాయం లేకుండా నే అతన్ని బతికించుకుంది.

వెంక:—ఇన్నాళ్ళూ పెళ్ళిమాట ఎత్తితే చురచురా చూస్తూ మూతి ముడుచుకుని కూర్చునేది...దానికి బుద్ధి కుదిరి వరుణ్ణి ఎన్నుకుందికనుక, త్వరలో నే పెళ్ళిచేస్తే నా బాధ్యతలన్నీ తీరుతయ్.

దాసు:—అంతమాత్రంతో నేనా ? మనుమణ్ణి సాకాలం ఛోయ్—

[వెంకట్రామయ్య నవ్వాడు]

కల్యా:—కాని పెళ్ళికిముందు ఒకషరతు.

మధు:—చెప్పండి రాణీగారూ!

కల్యా:—ఇలాంటి నాటకాలు ఇక ఆడరాదు.

మధు:—ఓ : మీరు ఆడినవాటికీ, మేము ఆడినవాటికీ చెల్లు...కొత్తగా ఎవ్వరూ యీ నాటకాల్లో పాత్రలు ధరించరాదు.

కల్యా:—అందుకు ముందు నటనసూత్రధారుల్ని వొదిలించుకోవటం మంచిది.

మధు:—నేనూ అదే అనుకుంటున్నాను. కార్యదర్శి మహాశయా! నిన్ను యీ ఉద్యోగంనుంచి తీసివేశాం!

దాసు:—ఏమిటోయ్ ?

మధు:—ఇకనుంచీ కల్యాణీదేవే నాకు అంతరంగిక కార్యదర్శిగా వుంటుంది.

కల్యా:—నేనుకూడా పద్మను అంతరంగిక కార్యదర్శిని పదవినుంచి తొలగించాను. ఇకనుంచీ మధుకుమారే నాకు అంతరంగిక కార్యదర్శిగా ఉంటాడు.

దాసు, పద్మ:—బతికించారు...యీ మధ్యవర్తిత్వాలూ, మంతనాలూ జరపలేక ఛస్తున్నాం.

బ్రహ్మాం:—ఐతే నాపనేం కానూ?

పద్మ:—హాయిగా సన్యసించు...

వెంక:—ఔనురా; అదే మంచిదిరా బాబూ!

దాసు:—మళ్ళీ పెళ్ళినాడు అందరం కలుసుకుందాం! మధుకూ, కల్యాణికీ జరగబోయ్యే యీ కల్యాణం "మధుర కల్యాణమే" అవుతుంది.

వెంక:—(ఔనన్నట్లు తలూపి) వెళ్దాం-కల్యాణీ రావా?

కల్యా:—మీరు పదండి...తరువాత కారు పంపండి—

[అందరూ నవ్వుకుంటూ వెళ్ళిపొయ్యారు]

మధు:—ఎంత గడుసుదానివి! ఎంత బాగా నటించావ్!

కల్యా:—మీకన్నానా ? నాచేత ఏడిపించారా ? బతి మాలించుకున్నారా ?

మధు:—కాళ్ళుకూడా పట్టుకున్నావా ?

కల్యా:—ఆ స్థితిలో ఏంచేశానో నాకు మాత్రం గుర్తా ఏమిటి ?

మధు:—ఆఁ—ఆ మాటలన్నీ నేను మరిచిపోతా ననుకున్నావా ? గుర్తు లేదనగానే సరిపోతుందా ! ఇక్కడ పెద్ద మనుష్యులంతా విన లేదనుకున్నావా ?

కల్యా:—యీసారి ఇలాటి ఎత్తువేస్తే చెప్తాను...

మధు:—ఎవర్ని సంపాయించేందుకు ఇన్ని పాట్లుపడ్డానో, ఆమె నాదయ్యాక, ఇంకా యీ పెడదార్ల అవసరం ఏముందీ ?

కల్యా:—అట్లా దారికిరండి. ఇకనుంచీ ఒకళ్ళనొకళ్ళం మోసంచేసుకోరాదు.

మధు:—ఉహుఁ. మధ్యవర్తులు లేరు కనుక, ఇక మనం హృదయాలతోనే మాట్లాడుకోవాచ్చు. ఔనా ?

కల్యా:—ఔను...!

మధు:—కారు వొస్తే వెళ్తావా ?

కల్యా:—వెళ్ళను..., కాని మీరు చిన్నపిల్లల్లే అల్లరి చేస్తుంటేమాత్రం వెళ్తాను—తెలిసిందా ?

మధు:—అల్లరిచెయ్యకుండా శిక్షించు...ముందు నాకు ఆకలి దహించుకుపోతోంది. లోపల కారేజీవుంది. కాస్త వొడ్డిస్తే...

కల్యా:—ఇప్పట్నుంచే చాకిరీ చేయించకండి !

మధు:—మరి సంసారమంటే...!

కల్యా:—నాకు తెలుసులెండి—పదండి, భోజనం చేశాక తీరిగ్గా మాట్లాడుకోవచ్చు.

[ఇద్దరూ లోనికి వెళ్తూండగా తెర]

(పడిపోయింది).





# శ్రీ మహాభారతము: వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు - 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భాగము | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణ పర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| ఆనుశాసనిక పర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల రు 37—8—0

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాంతం కైఫీయతు | 1 | 0 | నేనూ మా కాంతం | 1 | 0 |
| మునిమాణిక్యంనాటికలు | 1 | 0 | మునిమాణిక్యం కథలు | 1 | 0 |
| ఉపాధ్యాయుడు | 1 | 0 | కాంతం కాపురం | 1 | 0 |
| శరద్రాత్రులు | 1 | 0 | దీక్షితులు | 1 | 0 |
| రుక్కుతల్లి | 1 | 0 | తగూ నెంబరు త్రీ | 1 | 0 |
| యథార్థ దృశ్యాలు | 1 | 0 | వినోదవ్యాసములు | 1 | 0 |
| కాంతం | 1 | 0 | నా స్నేహితులు | 1 | 0 |
| హాస్యకథలు | 1 | 0 | దాంపత్యజీవితము | 1 | 0 |
| తల్లిప్రేమ | 1 | 0 | రేడియో నాటికలు | 1 | 0 |
| కథానికలు | 1 | 0 | రాధబాబు | 1 | 0 |
| తిరుమాళిగ | 1 | 0 | మేరీ కహానీ | 1 | 0 |

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| కాలక్షేపం 1 వ భా॥ | 1 | 0 | మాయలమాలోకం | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | అవును | 1 | 0 |
| గుసగుస పెళ్ళి | 1 | 0 | నిజం | 1 | 0 |
| ఇప్పుడు | 1 | 0 | మాటవరస | 1 | 0 |
| అప్పుడు | 1 | 0 | తనలో | 1 | 0 |
| అన్నీ తగాదాలే | 1 | 0 | మేజువాణీ | 1 | 0 |
| రెండు రెళ్ళు | 1 | 0 | మన తెలుగు | 1 | 0 |
| పెళ్ళి ట్రెయినింగ్ | 1 | 0 | లోకోభిన్నరుచిః | 1 | 0 |
| రాక్షసగ్రహణం | 1 | 0 | చెప్పలేం ? | 1 | 0 |
| వసంతసేన | 1 | 0 | ఈడమాజోడమా | 1 | 0 |
| ప్రణయరంగం | 1 | 0 | వినయప్రభ | 1 | 0 |

## శ్రీ ధనికొండ హనుమంతరావుగారి రచనలు

| | | | |
|---|---|---|---|
| తీర్పు | 1 0 | ప్రణయాన్వేషి | 1 0 |
| పవిత్రులు | 1 0 | దేవకన్య | 1 8 |
| ఇలవేల్పు | 1 8 | అనాథ | 1 8 |
| జ్ఞాని | 1 0 | అపనింద | 1 0 |
| బుద్ధిశాలి | 1 0 | చక్రి | 1 0 |
| ప్రమాదాలు | 1 0 | స్వార్థపరులు | 1 0 |
| కుక్కతోక | 1 0 | యుద్ధఖైదీ | 1 0 |
| ప్రియురాలు | 1 0 | గొడ్రాలు | 1 0 |
| సంజీవి | 1 0 | ఎర్రబుట్టలు | 1 8 |
| గర్వభంగం | 1 0 | సేవిక | 1 0 |
| పరిశోధన | 1 0 | శిక్ష | 1 0 |
| కాముకి | 1 0 | మధురకల్యాణం | 1 0 |
| లోకచరిత్ర | 1 8 | | |

## శ్రీ. చందూరి నాగేశ్వరరావుగారి రచనలు

| | | | |
|---|---|---|---|
| భానుమూర్తి భార్య | 1 0 | మహాబలిపురం | 1 0 |
| మాంగుళూరు మెయిల్ | 1 0 | నట్టింట దీపం | 1 0 |
| అంతేనా | 1 0 | భాష | 1 0 |
| ఆఖరుకోరిక | 1 0 | కొన్ని గ్రంథాలు | 1 0 |
| కాఫీ మానెయ్యడం | 1 0 | పరిచయంచేసిన పుస్తకాలు | 1 0 |
| ఎక్కడికి కమలా? | 1 0 | | |
| అన్యాయం | 1 0 | మనకీ ఒక కారు | 1 0 |
| శివరావు | 1 0 | క్రొత్తలోకాలు | 1 0 |
| కలడో లేడో | 1 0 | సీతతో సినిమాకి | 1 0 |
| రాధ నవ్వింది | 1 0 | | |

## శ్రీ జి. జాషువాకవిగారి ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఖండకావ్యము 1వ భా॥ | 1 | 0 | ముంటాజమహల్ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 | నాకథ (జీవితం) | 1 | 8 |
| డిటో 3 వ భా॥ | 1 | 0 | గబ్బిలము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 4 వ భా॥ | 1 | 0 | డిటో 2 వ భా॥ | 1 | 0 |
| డిటో 5 వ భా॥ | 1 | 0 | పిరదౌసి | 1 | 0 |
| నేతాజీ | 1 | 0 | స్వయంవరము | 1 | 0 |
| బాపూజీ | 1 | 0 | తెరచాటు—కల్పిత నాటకము | 1 | 8 |
| కాందిశీకుడు | 1 | 0 | | | |
| స్వప్నకథ | 1 | 0 | వీరాబాయి—చరిత్రాత్మక నాటకము | 1 | 8 |
| రాష్ట్రపూజ | 0 | 5 | | | |

## శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారి

## ఖండకావ్యములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉమర్ ఖయ్యాం | 1 | 0 | శబరి | 1 | 0 |
| పంచవటి | 1 | 0 | మృత్యుంజయం | 1 | 0 |
| బృందావనము | 1 | 0 | శృంగారచాటువులు | 1 | 0 |
| సుభాషితము | 1 | 0 | | | |

## శ్రీ విశ్వనాధ సత్యనారాయణగారి

ఆంధ్రపౌరుషము (పద్యకావ్యము) 1—0—0

## వేగుజుక్క గ్రంథమండలి (బరంపురం) వారి

## అపరాధ పరిశోధక నవలలు

వాడేవీడు 1 వ భాగము 1—8—0

| | | |
|---|---|---|
| నేనే | 2 వ భాగము | 1—8—0 |
| కాలూరాయి | 3 వ భాగము | 1—8—0 |

(ఈ పై మూడును కలిసి జమిలియా కథ యగును.)

| | |
|---|---|
| వేంకట్రావు | 1—8—0 |
| కోటీశుతనయ | 1—8—0 |
| విద్యార్థివిపత్తు - (కల్లపాలెం కృష్ణారావుగారు) | 1—0—0 |

## ఆంధ్రప్రచారిణీ గ్రంథమండలివారి నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| సీతారామరాయలు | 2 | 0 | పూర్ణానందము | 2 | 0 |
| రాజసింహ | 2 | 0 | దృఢప్రతిజ్ఞ | 1 | 8 |
| మృణ్మయి | 1 | 8 | వసుమతీవసంతము | 2 | 0 |
| సంపూర్ణ శ్రీకృష్ణ చరిత్ర | | | అపరాధిని | 1 | 8 |
| 1 వ భా॥ | 1 | 8 | ప్రణయచాంచల్యం | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 | రజని | 1 | 0 |
| అపరాజిత | 1 | 8 | వంగవిజేత | 1 | 8 |
| మధుర | 1 | 8 | నౌకాభంగం 1 వ భా॥ | 2 | 0 |
| మృణాళిని | 1 | 8 | డిటో 2 వ భా॥ | 2 | 0 |
| విషవృక్షము | 1 | 8 | సూర్యహాను | 2 | 0 |
| కృష్ణకాంతుని మరణ | | | అల్లాహో అక్బరు | 1 | 8 |
| శాసనము-పరిశోధక | | | జమీందారు — | | |
| నవల | 1 | 8 | రామరాజు | 1 | 8 |
| కమలాకాంతుడు | 0 | 6 | క్షమార్పణ | 2 | 0 |
| శకుంతల | 1 | 0 | | | |

## కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నవలలు

| | | |
|---|---|---|
| అహల్యాబాయి | 1 | 8 |
| రాజరత్నం | 1 | 8 |
| కృష్ణవేణి | 0 | 12 |
| హేమలత | 1 | 4 |
| కర్పూరమంజరి 1వభా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయం | 1 | 4 |
| సౌందర్యతిలక 1వభా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| వినోదములు 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Tales of Rajasthan అను | | |
| రాజస్థానకథావళి1 భా | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | 0 | 8 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి1 భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Lives of Great men | | |
| మహాపురుషుల జీవితచరిత్రలు | | |
| 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మహాపురుషుల జీవిత | | |
| చరిత్రలు 3 వ భా॥ | 1 | 8 |
| రామకృష్ణ పరమహంస | | |
| Life and Teachings | 1 | 0 |
| ప్రహసనమంజరి | 1 | 0 |
| నవ్వులగని 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| నానక్ చరిత్ర | 0 | 12 |
| గురుగోవింద చరిత్ర | 0 | 12 |
| సిద్ధార్థ చరిత్ర–గౌతమ | | |
| బుద్ధుని జీవితం | 1 | 0 |
| రఘుకులచరిత్ర – | | |
| రఘువంశం | 0 | 10 |
| సుధాశరచ్చంద్రము 300పే॥ | | |
| Lake of Palms | 2 | 0 |
| గణపతి హాస్యనవల1భా | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| నందచరిత్ర | 0 | 6 |
| కృపాంభోనిధి (భక్త చింతామణిలో వలెనే భక్తిరస పద్యములు కలవు) | 0 | 4 |
| భారతకథామంజరి | 0 | 8 |

## శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారి పరిశోధక నవలలు

| | | | |
|---|---|---|---|
| భీషణ ప్రతిహింస | 1 | 8 | 0 |
| ఘోర ప్రతిక్రియ | 1 | 8 | 0 |
| బలవంతరావు | 1 | 8 | 0 |

## అపరాధ పరిశోధక నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| వలపులరాణి | 1 | 0 | రక్తవాహిని (5 హత్యలు!) | 1 | 0 |
| అగ్గిరాముడు | 1 | 0 | ఇంద్రజాలము | 1 | 0 |
| భయంకరుడు 1 భా | 1 | 0 | రాజద్రోహి | 1 | 0 |
| నరేంద్రుడు 2 భా | 1 | 0 | అర్ధరాత్రి వింత (3 హత్యలు) | 1 | 0 |
| రమేశబాబు | 0 | 12 | దురాశ 1 భా | 1 | 0 |
| సర్కిల్ రంగనాథన్ | 1 | 0 | డిటో 2 భా | 1 | 0 |
| శకుంతల బి. ఎ. | 1 | 0 | దొంగలనాయకుడు | 1 | 0 |
| నీవేనా ? | 1 | 0 | మోహపిశాచం (270 పే॥) | 1 | 8 |
| శక్తికుమార్ | 1 | 0 | కాలసర్పము 1 భా | 1 | 0 |
| పంజాబు మెయిలు | 1 | 0 | డిటో 2 భా | 1 | 0 |
| కన్నపుదొంగ 1 భా | 1 | 0 | ఆనందభవనము | 1 | 0 |
| పగటిచుక్క 2 భా | 1 | 0 | మిస్ మధురిక | 1 | 0 |
| డిటో 3 భా | 1 | 0 | వ్యామోహము | 1 | 0 |
| (యీ 3 మూడుభాగములు చదివిన కథపూర్తియగును.) | | | విషహృదయం | 1 | 4 |
| రమాసుందరి 1 భా | 1 | 0 | | | |
| డిటో 2 భా | 1 | 0 | | | |

| | | | |
|---|---|---|---|
| నేనంటేతంటా | 1 8 | హాతింతాయి | 0 12 |
| ఛాందసుడు | 0 12 | మగడుకాని మగడు | 1 0 |
| అల్లరిపిల్ల | 0 12 | | |

## తల్లావఝుల శివశంకరశాస్త్రిగారి

| | | | |
|---|---|---|---|
| జీవనసంధ్య అను తేజసింగు | 1 8 | చదువుకున్న భార్య | 1 0 |
| | | ధర్మరాజు | 1 8 |
| జీవనప్రభాతము అను రఘునాధజీ | 1 0 | నే నెవరి భార్యను | 1 0 |
| | | నే నెవరి భర్తను | 1 0 |
| లవంగలత | 1 8 | | |

## శ్రీ వత్సవాయి రాయజగపతి వర్మగారి

మోడరన్ మేరేజస్ 1 8 0

## శ్రీ పొక్కులూరి రామచంద్ర వర్మగారి

హిందీ తెలుగు కోశ్ 6 0 0

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి